### శస్త్రాదులవలనఁ జచ్చువారికిఁ బెట్టు శ్రాద్ధము

సీ॥ శస్త్రంబువలనను జచ్చినవానికి నపమృత్యువశుఁడైన యట్టివాని
కుపసర్గమున మృతినొందినవానికి విషమునఁ బ్రాణము విడుచువాని
కాశుశుక్షణి దగ్ధుఁడైనట్టివానికి జలములలోఁబడి సమయువాని
కాశీవిషవ్యాఘ్రహతుఁడైనవానికి నుద్బంధనంబున నోరగువాని
కల్ల భాద్రచతుర్దశియందు శ్రాద్ధమాచరించినఁ దృప్తియగు నవనిపాల!”
యనుడు నానర్తధరణీశుఁ డమ్మునీంద్రు నీక్షణముచేసి భక్తిమై నిట్టులనియె.

ఆ॥ “ఏల శస్త్రహతుల కీభాద్రపద చతుర్దశి విధింపఁబడియె శ్రాద్ధకర్మ?
మన్యులకు మఱేల యానాఁ డనుక్తంబు? సంశయాస్పదంబు చాల నిద్ది. ౨౧౧

కం॥ ఏకోద్దిష్టంబు సపిండీకరణంబును బ్రశంసనీయంబులు గా.
నేకారణమున నానాఁ డాక్రియ లర్హంబులయ్యె ననఘా! చెపుమా. ౨౧౨

తే॥ శ్రాద్ధమంతయుఁ బెట్టుచు సంయమీంద్ర! యట విశేషించి పితృపక్షమందుఁగూడఁ
బార్వణముసేయ వచ్చెడి పాపమేమి? తెలుపు మెందుల కది నిషేధింపఁబడియె?”

కం॥ అనియిటు వాక్రుచ్చుడు ముని“యనఘ! హిరణ్యాక్షుఁడనెడి యసురుఁడు పూర్వం
బునను బృహత్కల్పంబున ఘనసురలకు భయదుఁడగుచుఁ గడు ఘోరుండై ౨౧౪

తే॥ బ్రహ్మగూర్చి తపముండి బహువిధముల నట విశేషించి భాద్రపదాఖ్యమాస
బహుళపక్షచతుర్దశిం బ్రస్తుతింప నెంతయును మెచ్చి యతఁడప్పు డిట్టులనియె.

శా॥ “సంతోషించితిఁ. జెప్పు వాంఛితము. వత్సా! యద్ది యీరాని కోం
డంతైనన్ బదులాడ కిచ్చెదను” నా నయ్యాతుధానుండు “వా
క్కాంతా! ప్రేతపిశాచభూతతతి రక్షశ్శ్రేణి క్షుత్క్షాములై
చింతన్ నిత్యము భక్ష్యసంచయము యాచింపం దదర్థంబుగన్ ౨౧౫

ఆ॥ తపముసేయుచుంటిఁ. దరణి కన్యారాశి నధివసింప నొక్కయహము నిమ్ము.
తద్దినమునఁ గుడిచి తత్ప్రేతభూతంబు లబ్దమెల్లఁ దృప్తులై వసింప” ౨౧౬

చ॥ అని వచియించుడు న్నలువ “య ప్పితృపక్ష చతుర్దశీతిథిన్
జనుఁ డెవఁడేని యాత్మపితృసంఘముగూర్చి శ్రాద్ధముం బొన
ర్చిన నది ప్రేతభూతతతిఁ జెందు మదుక్తి నసంశయంబుగా.
దనుజవరేణ్య! నీవనిన తక్కిన దుర్మృతులున్ సమిద్ధతుల్ ౨౧౭

కం॥ తనుజకృతైకోద్దిష్టంబునఁ దృప్తిం గాంచఁగలరు పొమ్మని యపు డా
వనజజుఁ డదృశ్యుఁడగుటయు మనుజాశనుఁ డరిగెఁ దనదు మందిరమునకున్.

## —* కలియుగమునకుఁ దగిన పుత్త్రులు *—

ఆ॥ అర్హులైనయట్టి యచలామరులఁ బిల్చి యచట సపార్వణముగ నవనినాథ!
శ్రాద్ధమును ద్విజుండు సల్పంగనా విపరీతమైన నద్ది వృథయె యగును. ౨౩౩

కం॥ జారజముఖ్యద్విజులను జేరిచి యేపైతృకంబు చేయంబడునో
యోరాజవర్య! యదియును నీరహి నిష్ఫలము. సంశయింపకు" మనుడున్ ౨౩౪

కం॥ ఆనర్తక్ష్మాపాలుఁడు "మౌనీంద్రా! జారజాదిమహితశ్రాద్ధం
బేనియతఫలము నిడదను నీవడివిన భయముగలిగె నిజముగ నాకున్. ౨౩౫

సీ॥ కన్నియం బెండ్లాడి కాఁపురమునకు రానావెయందునఁ గన్న యర్భకుఁడును
దాఁ బెండ్లియాడిన తన్వంగి తనయాజ్ఞఁ బరువల్లఁ గన్నట్టి బాలకుఁడును
నడిగినవిత్తంబు నిడి యన్యునొద్దనుండి గ్రహించినటువంటి డింభకుఁడును
శరణమెవ్వరులేక చనుదెంచి తనచేతఁ బోషింపఁబడినట్టి బొట్టెయుఁ బ్రతి
పన్నుఁడు సహోఢ కానీనులు న్నరేంద్ర! కుండగోళులు ముఖ్యశిష్యుండు మిత్తి
బారివలనను రక్షింపఁబడినవాఁడు స్వవనసంస్థాపితాశ్వత్థపాదపమును ౨౩౬

కం॥ ఈపన్నిద్దరు సుతులని మా పూర్వికుఁడైనయట్టి మనువు వచించెన్.
బాపులఁగా గణియించుచు నీపగిదిం జెప్పెదీవి దేమి మహాత్మా!" ౨౩౭

ఆ॥ అనుడు భర్తృయజ్ఞుఁ "డయ్యది సత్యంబె. సుతులె వారు ధర్మస్మృతిని జూడ,
మూఁడుయుగములందు ముఖ్యులే యవ్వారు. కలినిమాత్ర మట్లు కారుతలఁప. ౨౩౮

తే॥ అట్టిసంతతి సత్యాఢ్యులైనయట్టి తద్యుగంబులవారికిం దగునుగాని
తగునె యత్యల్పమేధసులగుచునుండునట్టి కలికాలజనముల కనఘులిడక. ౨౩౯

కం॥ ఏతద్వ్యవహారంబు ప్రపాతద మాఁ గలియుగమున. బహ్వాల్పబలం
బై తోఁచు తద్యుగప్రజకీతీరు విధింపఁబడియె బుష్టితతిచేతన్. ౨౪౦

తే॥ కలిని నసవర్ణవుం బెండ్లి సలుపఁదగమి నప్పు డవివాహితలతోడ వ్యభిచరించి
యోనిసంకరమొనరింప నొదవునట్టి సుతుల వితమును వచియింతు క్షితిప! వినుము.

సీ॥ బ్రాహ్మణస్త్రీయందు బ్రాహ్మణునకుఁబుట్టు నధమాధముఁడు చారుఁడనఁగఁబడెడు
బ్రాహ్మణస్త్రీయందు బాహుజునకుఁబుట్టు నాతండు సూతుఁడం చనఁదగియెడు.
బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకుం బుట్టువాఁడు మాగధుఁడునాఁ బలుకఁబడెడు.
బ్రాహ్మణస్త్రీయందుఁ బదజునకుంబుట్టు చెట్ట యంత్యజుఁడునాఁ జెప్పఁబడెడు.
కాన నిట్టిసుతులు కలిలోనవర్జితుల్. ద్వాదశప్రకార తనయులందు
నేడుగురు సుపుత్రు లేన్గురు కులహంత. లుర్విఁ ద్రోయుదురు స్వపూర్వికులను.

సీ॥ కన్నెరికంబునం గడుఁబ్రీతిఁ బెండ్లాడు నాతియం దొదవు స్తనంధయుఁడును
దల్లిదండ్రులచేతఁ బ్రయుక్తవిధముగా వార్షించి దత్తుఁడౌ నాత్మజుఁడును

కం॥ నాందీముఖాన్యమగు పితృబృందంపుం గ్రియలనెల్లఁ బృథివీరమణా!
జందెం బపసవ్యము దోడుగం దగు శ్రాద్ధములయందుఁ గర్తల కెపుడున్. ౨౫౩

కం॥ చేతనయినంతమంది ద్విజాతులఁ గూర్చుండఁబెట్టఁజను సాధుజన
త్రాతా! విశ్వేదేవుల ఖ్యాతస్థానమునఁ బ్రాఙ్ముఖంబుగ నుండన్. ౨౫౪

కం॥ పితరులస్థానమున ద్విజత్రితయత్రితయంబొ లేక త్రితయమొ యొకరో
సుతుచే నుత్తరముఖముగ క్షితిపాలకవర్య! యదియొక్రియ సంస్థాప్యుల్. ౨౫౫

శా॥ "దేవానామిద మాసనమ్మనుచు" నాదేవళ్ళకుం దద్విధం
బావెన్వెంటఁ బితృక్రియంబునకు పవ్యంతప్రయోగంబుతో
నైవంగావలె నాసనంబు నృపతీ! వారందుఁ గూర్చుండి య
ప్డే వాక్రువ్వ "సుఖాసనం"బనుచు నెంతేనిం బ్రమోదంబునన్. ౨౫౬

తే॥ అపుడు ఋజుదర్భజలసంయుతాక్షతలును విషమదర్భలు జలతిలల్వేయవలయు
వారి కుడియెడమలయందు వరుసగాను. జేతులం బెట్టఁదగదద్వి ధూతమతిని.

కం॥ ఆతీరున జలదర్భలు చేతులనే పెట్టఁబడినఁ జీయని పితరుల్
వీత తదాసనులయి సంప్రీతిని నటఁ గూరుచుండ మేకొన రాత్మన్. ౨౫౭

తే॥ పితరులను దేవతలను వేర్వేఱఁ జేయనగును నావాహనము ద్వితీయావిభక్తి.
మఱియొకవిభక్తిఁ జేసిన నరుగుదేర రాఁకటం గుందుచుంగూడ నవాహా! వాఁడు.

కం॥ విశ్వేదేవాహూతిని "విశ్వేదేవాస" యనఁగ వెలసెడి మనువున్
విశ్వేశ! యుచ్చరించుచు వేశ్వేతాక్షలఁ దలల వేయఁగవలయున్. ౨౬౦

కం॥ అంత "నుశంతస్త్వా "నామంత్రించి పితాళ్ళ వారి మస్తములు తిలా
క్రాంతములు సేయునది. "ఆయంతున "యను మంతరంబున నటు జపమ్యంబొ.

మంత్రము॥ శంనోదేవీ రభిష్టయ. ఆపోభంతు పీతయే. శంయోరభిస్రవంతునః. ౨౬౧

ఆ॥ క్షత్రియాగ్రగణ్య! స్వాహాయుతముగ నీమంతరమును జదువు చంత దేవ
తార్ఘపాత్రలెల్ల నర్ణఃప్రపూర్ణముల్ సల్పవలయుఁ జుమ్ము శ్రద్ధతోడ. ౨౬౩

ఆ॥ అందులో"యవోసి యవయా"యనెడి మంత్రమును బఠించుకొనుచుఁ బువ్వుచంద
నాక్షతలను వైచి యర్ఘంబొసంగనా వారి సహపవిత్రపాణులందు. ౨౬౪

కం॥ సస్వాహాకారం బట జ్యాస్వామిచయాగ్రగణ్య! "యాదివ్యా" యన్
సస్వరమనువున నుదకము భాస్వరపితృదేవతార్ఘ పాత్రల నిడనా. ౨౬౫

మంత్రము॥ తిలోసిసోమదేవత్యో గోసవో దేవనిర్మితః
ప్రత్నవద్భిః పృక్తః స్వధయా పితౄ౯ నిమాన్ లోకాన్ ప్రీణాహి నస్స్వధా.

కం॥ ఈ వైమంత్రముఁ జదువుచు నాపాత్రలఁ దిలల వైచి "యాదివ్యా" యం
చాపైఁజెప్పిన మనువున భూపాలా! యర్ఘమీయఁబోలును బిదపన్. ౨౬౬

ఆ॥ పిండపిండమందు వేర్వేఱుంగా దారములనుబెట్టి యంత భూమిసురులఁ
బోలెఁ బూచితములఁ బొనరించి యాచమనంబుసేయవలయు నరవిభోజ! ౨౯౧

కం॥ ప్రక్షాళితకరచరణత నాత్మునను పితాళ్ళకెరఁగి యటుతరువాతన్
బ్రోక్షించి సవ్యముగ క్ష్మాధ్యక్షా! యాచింపవలయు నగ్హాశీస్సుల్. ౨౯౨

ఆ॥ అటుపయిం బితాళ్ళ కక్షయ్యసలిలం బొసఁగి పవిత్రములను సరిగ మీఁది
కగుపఱచి 'స్వధా' యటంచుఁ గీర్తించి 'యస్తుస్వధా'యటంచు క్షోణిసురులు ౨౯౩

కం॥ అనుటయుఁ బిండంబులపై నునిచి మధువు పాయసము తిలోదకమును నో
య్యన 'నూర్జస్వ' యనంజనుమనువునఁ బిత్రుపిండములను మఱియుంచఁగనో. ౨౯౪

ఆ॥ అర్ఘ్యపాత్రములను నటుపయి వెలికిలఁద్రిప్పి స్వర్ణమయము దేవతలకు
వెండి పితరులకును విధ్యుక్తదక్షిణ యిచ్చునది వసుంధరేశ భక్తి! ౨౯౫

కం॥ తరువాత జందెమును గుడికరమునకుం దొడిగి శ్రాద్ధకర్త మహీశా!
గరిమఁ బిత్రుత్రయమునకును వరుసగ స్వస్త్యుదకములను వదలఁగవలయున్. ౨౯౬

కం॥ ఆమీఁద శ్రాద్ధనియమితభూమిసురోచ్ఛిష్టపాత్రముల నెత్తివలెన్.
స్త్రీమాణవకప్రముఖులు తా మాపాత్రలను దీయఁదగ దెన్నటికిన్. ౨౯౭

ఆ॥ ఈప్రకారముగను నెంగిలివిస్తళ్ళ స్వయముగానెతీసి శ్రాద్ధకర్త
క్షాళితస్వపాదళయయుగళుండయి భూసురులకు భక్తి నోసిలొగ్గి ౨౯౮

శ్లో॥ అఘోరాః పితరస్సంతు. అస్మద్గోత్రం వివర్ధతాం.
దాతారో నోభివర్ధంతాం. వేదా స్సంతతి రేవ నః. ౨౯౯
శ్రద్ధా చ నోమా వ్యగమ. ద్బహుధేయంచ నో స్త్వితి.
అన్నంచ నో బహుభవే. దతిథీంశ్చ లభేమహి.
యాచితారశ్చ నస్సంతు. మాచ యాచిష్మ కంచన. ౩౦౦

కం॥ అనిప్రార్థించి యివే దీవనలవుఁగాకనుచుఁ గర్త పచియించుటయున్
వినివిప్రులు సంప్రీతిని ననవలయుఁ దథాస్తటంచు నవనీనాథా! ౩౦౧

ఆ॥ స్వస్తికొఱకు ధరణి సవ్యంబుగం బిత్రుపూర్వ ముదకములను బోయవలయు.
వసుమతీకళత్ర! వాజేయనెడిబుక్కు నని పవిత్ర మవల నునుపవలయు. ౩౦౨

కం॥ ఆమావాజస్యయనన్ క్ష్మామండలి ఖ్యాతమైన సన్మంత్రముచే
నామహీసురులకు వలగొని ప్రేముడి నటుఁ గూరుచుండఁబెట్టి తదంఘ్రుల్ ౩౦౩

ఆ॥ అదిమిపట్టిపిసికి యనిపి యాసీమాంత మన్న బలినిపైచి యధికనిష్ఠ
వహానమూని గగనమణి యుండఁగానె భోజనముసేయవలయు మనుజనాథ! ౩౦౪

ఆ॥ ప్రాద్గ్రంథుపిదప భుజియించుచో వ్యర్థమగును శ్రాద్ధకర్మ మవనిపాల!"
యనివచించుటయును నానర్తభూపాలుఁ డెడఁదలోన మఱియు నెఱుఁగఁగోరి

—* ఏకోద్దిష్ట సపిండీకరణవిధి *—

క॥ "ఏకోద్దిష్టశ్రాద్ధం బేకరణిం జేయవలెనొ యెఱిఁగింపఁగదే
యోకారుణ్యనిధీ!"యని వాకొనుటయు న త్తపస్వివరుఁ డిట్లనియెన్. ౨౯౬

క॥ సంచయనమునకుమును గావించెడి శ్రాద్ధములుమూఁడు. విను. మరణంబున్
గాంచినయెడ నడుమను శవముంచినయెడ దహనకర్మ మొనరిచినయెడన్ ౨౯౭

ఆ॥ అవ్విగాక మృతున కాద్యతృతీయపంచమదినంబులందు సప్తమమున
నవమదశమములను నవనీశ! కలవు శ్రాద్ధంబు లాఱు పెట్టఁదగిన వింకను. ౨౯౮

తే॥ అన్నియుంగూడి శ్రాద్ధంబు లగును దొమ్మి. దందు వైతరణీశ్రాద్ధ మంతిమమునఁ
బెట్టఁదగినది. యయ్యది పెట్టుపిదపఁ బ్రేత సంతృప్తిఁబొందుఁ బృథ్వీకళత్ర! ౨౯౯

క॥ ఆవాహనంబు పూజ్యము దైవం బంతకునుసున్న తత్పాత్రిధమునన్.
గావింత్రైకపవిత్రత నీవివరం బెఱిఁగి విబుధు లేకాగ్ర్యమునన్. ౩౦౦

క॥ ఒనరిచి తృప్తిప్రశ్న మ్మనంతరము కొలఁదిస్వదిత మటువలెఁ గావిం
చునది. యభిరమ్యతామను మనువున వదలునది యుల్లసమానసు నంతన్. ౩౦౧

ఆ॥ చీలిపోకయుండ ఛిన్నంబుగాకుండ దనరుచున్న రెండుదర్భపోఁచ
లవనినాథవర్య! యవిగదు యేకోద్దిష్టములఁ బవిత్రమనుచు ననుగొనఁగు. ౩౦౨

వ॥ సర్వత్ర పితః, గోత్ర, శర్మన్, అనియు, తర్పణమున, పితా, గోత్రః, శర్మా, అనియు, సంకల్పమున, పిత్రే, గోత్రాయ, శర్మణే, అనియు, అక్షయ్యసలిల దానంబున, పితుః, గోత్రస్య, శర్మణః, అనియు, ఆసనమున మాతః, అనియు సంకల్పమున మాత్రే, అనియు, అక్షయ్యసలిలదానంబున మాతుః, అనియు ౩౦౩

క॥ గోత్రేయనియును మాతృనకు గోత్రాద్దామనియు నటులె గోత్రాయాయం
చో త్రిణయనసత్క్రియాపాత్ర! ప్రథమాదిగా విభక్తు లెఱుఁగుము. ౩౦౪

తే॥ దేవి దేవ్యై యటంచుఁ గర్తింపవలయును. మఱియు దేవ్యాయటంచును మాతననఘ!
ప్రథమమునుఁ జతుర్థి నష్టి యావిధమున గాను శ్రాద్ధసంసిద్ధికై ప్రయోజ్యములు సుమ్ము. ౩౦౫

క॥ గహితవిభక్తికముగనొ యొనరింపఁబడు నవ్విభక్తి వేఱైనను కృతమౌ
మహితశ్రాద్ధంబైనను సహితం బకృతము. పెంపదద్ది మఱి పితృగణముల్. ౩౦౬

ఆ॥ కాన యత్నపూర్వకముగ నిర్ణయద్ధర్మములయందు యాథార్థ్యమును విభక్తు
లను నిరంతరంబుఁ బొనరింపనగు శ్రాద్ధకర్మమందు విగతి గార్శ్యపీశ! ౩౦౭

తే॥ అట సపిండీకరణము సమాంతమందు జరుపవలయును నాన్ధ్రధరణిపాల!
వృద్ధి యొకవేళ నేతెంచెనేని యరసి పూర్వమేనియుఁ గావింపఁ బోలియుండు.

ఆ॥ పార్వణోక్త విధిని నుర్విఁ ద్రిదైవత్యముగ నదైవికముగ మొనసి ప్రేతఁ
గూర్చి చేయవలయు గురుతనేకోద్దిష్ట మేకపాకమున మహీభుభుక్షు! ౩౦౯

ఆ॥ ప్రేతకొఱకుఁగాను ప్రీతిఁ గల్పించిన యర్ఘ్యపాత్రదీసి యవనిపాల!
త్రిపితృపాత్రలందుఁ ద్రివిధంబుగం జించి యుంచవలయు శ్రద్ధ యుట్టిపడఁగ.

తే॥ అట్లు పిండంబు త్రివిధంబు లాచరించి 'యే సమాన' యనం గరమెసఁగుమంత్ర
ములను రెండును బఠియించి యొలయు శ్రద్ధఁద్రిపితృపిండంబులం గల్ప నపుడు మృతుఁడు

కం॥ ప్రేతత్వవిముక్తుండై ప్రీతిం జెందును మహీశ! పితృపూర్వముగా
నాతర్వాత యథాక్రమ మేతత్పిండములమీఁద నించుక జలముల్ ౩౧౨

కం॥ ప్రోక్షించి గంధమునఁ బుష్పాక్షతలను ముగుర శ్రద్ధనర్చించి యిలా
ధ్యక్షు! పితృత్రయి పేళ్ళను స్వాక్షరముగ నుచ్చరించి యట్లు చతుర్థుల్ ౩౧౩

తే॥ విడువవలెఁగాని కొందఱువిడువకట్లు ప్రేతశబ్దముతోడనే పితకు ముందు
పెట్టుచుండిరి యిల శ్రాద్ధ. మట్టిచేత నామతముగాదు మేదినీనాయకాగ్ర్య! ౩౧౪

కం॥ క్షయతిథి భాద్రచతుర్దశిఁ బ్రియతమ! యీరెంటివిడి సపిండీకరణం
బయినతరువాత నొప్పదు త్రయి యేకోద్దిష్టమనెడి శ్రాద్ధముజరుపన్ ౩౧౫

కం॥ ఎవఁడు సపిండీకృతుఁడై పావణించెడిప్రేత భిన్నమగు పిండమునం
దవిథిగ యోజనసేయునొ యవునాతఁడు పితృహుఁడద్ది యకృతంబ యగున్.

ఆ॥ తండ్రిచచ్చిపోయి తాతజీవించుచోఁ దండ్రిపేరుచెప్పి తాతతండ్రిఁ
బేర్కొనంగవలయుఁ బృథ్వీశ! తాత ప్రత్యక్షముగనె యచట నారగించు. ౩౧౭

ఆ॥ తాత క్షయదినమున ధరణీశ పార్వణశ్రాద్ధ మాచరింపఁ జనునుజుమ్ము.
తనదుజనకువిడిచి తాత కొల్లనియుఁ బెట్టఁదగదు పితకు భీతుఁడగుచు. ౩౧౮

కం॥ సకలామావాస్యలఁ దప్పక పార్వణమాచరింపవలె మృతపితకుం.
డకలంక! ప్రేతపక్షమునకు నడుచునుగూడఁ బార్వణము చేయఁగనౌ. ౩౧౯

తే॥ ఎంతవఱకు సపిండత యేరుపడదొ యంతవఱకును బితృపక్షమందుఁ బితకుఁ
దగదు శ్రాద్ధంబుపెట్టఁ,బితామహాదులకు నొనర్పఁగవచ్చు నిలాతలేశ! ౩౨౦

కం॥ పితృపిండంబులతోడం గృతసాపిండ్యుండుగాక కృతసుకృతుండౌ
పితయును బ్రేతగనుండెడు. క్షితిపా! సాపిండ్య మందుచే నేర్పడియెన్. ౩౨౧

ఆ॥ ఎవఁడు చేసికొన్న యేన స్సుకృతముల వార లన్యయోనిఁ బడియు నచట
వంశభవులొసంగు వారి ప్రభృతులచేఁ దృప్తిఁ బొందుచుంద్రు ధీర" యనుడు ౩౨౨

కం॥ "పుత్రుల పౌత్రుల కలలం బిత్రాదులువచ్చి యేమొ పెట్టునటంచున్
రాత్రులఁ గోరుచునుందురు. ధాత్రీసుర ! యేమగునిది ? దయ నుడువఁగదే" ౩౨౩

కం॥ అని యానత్తుండడుగుడు మునివర్యుఁడు "గతులులేక పొక్కుచుఁ బ్రేత
త్వనియుక్తినుండు వారలు జననాథా ! వచ్చుచుంద్రు స్వప్నంబులలోన్" ౩౨౪

కం॥ అని వక్కాణించుటయును "ననుఁగుం బుత్రకులులేని యవ్వారల కో
మునివర ! సాపిండ్యం బె ? ట్లనవుడు నృపుతోడఁ దపసి యపు డిట్లనియెన్. ౩౨౫

తే॥ "ఎవరి కొరకు సతను జాతుఁ డేరుపడఁడొ యతఁడు నాలవవాఁ డెట్లులగును దలఁప
నొగిఁ బ్రకర్షంబుగాఁ బొందుచుండుఁగానఁ బ్రేతయనిచెప్పఁబడియెడుఁ బృథివి మృతుఁడు.

తే॥ సుతుఁడొ తోఁబుట్టువో లేక సతియొ మృతున కొనరుపఁ వలె సాపిండ్య మోన్నృపాల !
కానిచో క్షేత్రజాది కైకాదశాత్మజుల సుతప్రతినిధులఁగాఁ దెలియవలయు. ౩౨౭

కం॥ కాలమున నుత్తరక్రియ మేలుగఁ గాకుండిన నపమృత్యువశులకుం
బోలెను నారాయణబలి వాలాయంబుగను జేయవలెఁ బ్రేతత వోన్. ౩౨౮

ఆ॥ ఆత్మహంతలకును నవనీసుపర్వుచే మరణమొందినట్టి మనుజులకును
నాచరింపవలయు నదియె నారాయణబలి" యటంచు నిట్లు పలుక నతఁడు ౩౨౯

ఆ॥ "ఎట్లు మృత్యువెనయు నిలఁ బురుషుండుదా ? నేసుకర్మమునను నేగు దివికి ?
ముక్తియెట్లువడయు మునినాథ ! నిరయసం దేలకూలు ?" ననుడు బుషివరుండు

—✻ నరకములు తన్నివారణోపాయములు ✻—

ఆ॥ పుణ్యపాపములను బూర్ణమౌ జ్ఞానముఁ గలవు ప్రజకు మూఁడుగతులు. వానఁ
బుణ్యమునను స్వర్గమును బాపమున నరకమును జ్ఞానమునను నమృత మొందవు.

శా॥ ఈయర్థంబు భవిష్యభీష్మ నల శ్రీకృష్ణుండు తోడ్పాటుగా
ధ్యాయం బోయి యుధిష్ఠిరుండు "యమువీటం బాపకృత్ప్రాణ్యముల్
చేయాయంబు ల్గలవంటు నారకము లవ్వేనోన్. కిమేనస్సులన్
జేయం బ్రాప్తము లౌనో. నిందుకృపతోఁ జెప్పంగదే" నాపుడున్ ౩౩౦

తే॥ ఆతఁడిట్లను. యమలోకమందు వత్స ! యేకవింశతినరకంబు లెసఁగుచుండు.
జంతువులు స్వస్వకర్మానుసారముగను నచటికింజని కృఛ్రంబు లనుభవించు. ౩౩౧

తే॥ చిత్రుఁడు విచిత్రుఁడను పేళ్లఁ జెలఁగుచుండు రచటఁ గాయస్థులిరువు. రందఱుములను వి
చిత్రుఁడుం జిత్రుఁ డాంలి శ్రేయములను వ్రాయుచుందురు యత్నపూర్వకముగాను.

సీ॥ మఱిఁ గరాళుండనఁ బరఁగెడివాఁడును వికరాళుఁడనుసంజ్ఞ వెలయువాఁడు
వక్రనాసుండన వర్తిల్లువాఁడు మహోదరుండను పేర నున్నవాఁడు
సౌమ్యాహ్వయంబుతో సంయుక్తుఁడగువాఁడు శాంతుండునాఁబడు శాంతియుతుఁడు
నందుఁడన్ సంశ్రావ్యనామంబుగలవాఁడు నటు సువాక్యుండను పటుమతియును
యముని దూతలు. వారియం దాద్యులైన భయదరూపులు నలువురం బాతకులను
మంచిరూపంబుగల కడను నలుగురును సుకృతులను యమపురికిఁ జేర్చుదురు సతము.
తే॥ వారివశమున లెక్కింపవలనుగాని యంతనుంది భటుల్గల రనఘ! వారు
చిత్రుఁడు విచిత్రుఁడును వ్రాయుపత్రములను గొంచుఁ జని యందుఁ గలరీతిఁ గొంకకుండ
తే॥ అప్సరోగణసేవిత మగు విమానములను నెక్కించి ధర్మంబు సలుపువారిఁ
గట్టియుం గొట్టియుం గ్రూరకర్మరతులఁ బట్టుకొనిపోవుదురు యము పట్టణమునకు.
తే॥ వారలకు బాసటగనుండ జ్వరముఁ దొట్టి వ్యాధులును నూటరెనిమిది యముని చేతఁ
గల్పితము. లవ్విచని మును కైవసంబు చేసికొనుచుండుఁ బ్రజ యుధిష్ఠిర! బలిమిని.
తే॥ అంతటం గింకరులుపోయి యచటనుండు నరుల కగుపడకుండఁ దన్నాభిమూల
సంస్థితప్రాణవాయువు సంగ్రహించి తనువు నటుడించి యమమార్గమునఁ జనుదురు.
తే॥ ఎనుబదియు నాలువేలయోజనములపయి నున్న [illegible] యమపురి మునను న్నచోటి,
కచట వైతరణీసమాఖ్య నదియొకటి రెండుపాయలఁ బ్రవహించుచుండు నెప్పుడు.
కం॥ ఒకపాయను జలములు వేఱొకపాయను నెత్రు నడుమ నురుశస్త్రిములున్
బ్రకటముగఁ గలిగి యది పాండుకుమారా! ప్రాణులకుఁ గడున్ భయదంబౌ. ౪౮౦
ఆ॥ మేనుదొఱఁగువేళ మేదినీసురునకు ధేనువిచ్చువాఁడు దానితోఁకఁ
బట్టుకొని తరించు భరతర్షభా! తాను జలములున్నపాయ శ్రమము నాక. ౪౮౧
కం॥ ఇతరుఁడు తనచేతులతో నతికష్టము మీఁద నీఁది యలసినవాఁడై
శతయోజనవిస్తృత శోణితస్రోతస్సు దాఁటు నేర్వఁగవలయున్. ౪౮౨
ఆ॥ కాన మనుజు లంత్యకాలంబునందు గోదాన మాచరింపఁ దగును. దాని
కవల ధర్మస్మృతిని నరుగు ధర్మిష్ఠుండు. పాపమార్గమునను బాపయోగు. ౪౮౩
కం॥ వైతరణి యపరతటమున భీతిద మసిపత్రవనము బిట్టుల రెడు. దు
ర్నీతిఁ బరభార్యఁ బరధన మేతులువ హరించు నాతఁ డిటఁ గోయఁబడున్. ౪౮౪
ఆ॥ అట్టి కొలఁగూడ నాత్మజకృత నవశ్రాద్ధములనుజేసి సరవి నచటి
కలుకులంపములను గలకల తెలుఁగంగఁబడక ముక్తుఁడగును బాండవేయ! ౪౮౫
ఆ॥ ఆవల నొక్కభూరుహము కూటశాల్మలియనఁగ వాఁడిముండ్ల నలరుచుండు.
ప్రేలుచుండ్రు క్రింద విశ్వాసఘాతకుల్ తల్లక్రిందుగాఁగ దగ్ధులగుచు. ౪౮౬

క॥ కూటశాల్మలిద్రు గురుశాఖలం దలక్రిందుగాఁగ వ్రేల నుంద్రుగాక.
తద్విముక్తి ధర్మతనయ! యేకాదశశ్రాద్ధముననుజేసి సంఘటించు. 3౪౮

ఆ॥ అవలినరకమనఘ! యంత్రాత్మకంబు. బ్రహ్మఘ్ను లనుభవింపనది తగినది.
వంశజుండొనర్చు ద్వాదశశ్రాద్ధంబు ద్వారముననె నగును దద్విముక్తి. 3౪౯

చం॥ పదపడి యుక్కుకంబములు ప్రజ్వలమానములౌచునుండు. దు
ష్కృద మొగఁబట్టి యన్యతనుమధ్యలఁ బొందెడివాఁడు వోయి యా
పెదపెదయుక్కుకంబముల బిగ్గఁ గవుంగిటఁజేర్చనొను. న
య్యాదియును దప్పు మాసికసమాచరణంబున వానికిన్ సుతా! 3౫౦

ఆ॥ ఇనుపపండ్లకుక్క లిఁకఁ బ్రహ్మమాంసాశులను భుజించుచుండు బలిమి సవల.
దానివలన ముక్తుఁడౌను త్రైపక్షికశ్రాద్ధముననుజేసి సత్యముగను. 3౫౧

ఆ॥ ఇనుపముక్కుకాకు లిఁకఁగొంచెమావల. స్త్రీ పరాగముగను జేరిచూచు
వానిగ్రుడ్లువొడుచు వడిఁ బట్టుకొని యవ్వి. మాను నది ద్వితీయమాసికమున. 3౫౨

తే॥ ఆపయిం గూటశాల్మలి. యట్టి లోహనయపు ముండ్లును గలవు. తన్మధ్యమునఁ
గొండెకాండ్రు బలాత్కృతి గుంజఁబడుదు. రదియుఁనుద్వితీయ మాసికంబైన దొలఁగుఁ

ఉ॥ రౌరవనారకంబు కడురౌద్ర మనంతరమందు. దానిలో
ఘోరతరాయుధంబులను గొట్టియు నెట్టియు బ్రహ్మహంతలన్
దూఱుదు రగ్గలంబు యమదూతలు. నాలవమాసికంబునన్
వారు విముక్తులౌదు రటువంటిమహాపదనుండి ధర్మజా! 3౫౪

తే॥ అవలినరకము క్షారోద. మటఁ గృతఘ్ను లడుగు లూర్ధ్వంబునం దుత్తమాంగ మవనిఁ
గాఁగ వ్రేలాడుచుండు రిక్కరణి. నేనవదగు మాసికమున ముక్తి వారి కొలయు.

శా॥ కుంభీపాక మనంతరం. బది మహాఘోరంబు. తద్దుర్గతిన్
డింభప్రాణములన్ హరించు కటికన్ దండాభిసంధిం బ్రవి
ష్టాంభోగామినిసుతప్తతైలమున నుం. త్రోబాధ షణ్మాసికా
రంభంబైన యనుక్షణంబ తొలఁగున్ రాజేంద్ర! యింకేమనన్. 3౫౬

కం॥ పాములుఁ దేళ్ళుం గలదై యామీఁద నిఁకొక్క నరక. మట జాంభికులన్
వేసులు శిక్షిం. త్రేడవదౌ మాసికముననుఁ జేసి యయ్యది వాయున్. 3౫౭

మ॥ అట సంవర్తకనామదుర్గతియొకం. డామ్నాయ విప్లావకుల్
పటువాక్యంబుల సానులం దెగడు కూళల్ వహ్నితప్తంబులౌ
పటుకాఱు ల్దమ కొండెనాలుకలకుం బట్టించి లాగన్ భటుల్
త్రుటితస్వాంతములందుఁ బ్రాకృతములన్ దూషించుచుం ద్రెచ్చుటన్. 3౫౮

ఆ॥ అన్నృతవాదిజనుల యంగంబుఁ గుక్కలు కొఱికి తినుచునుండు మఱియునచట.
నవ్విపొల్లఁ దప్ప కష్టమమాసికశ్రాద్ధదానమునఁ బ్రశాంతి వొందు. 3౫౯

ఆ॥ అగ్నికూటనరక మతిదారుణం బందుఁ గూటసాక్ష్యమిడిన క్రూరజనులు
యాతనను సహింత్రు. తద్వార్ణవమమాసిక ప్రదానమునను గాంత్రు ముక్తి. ౩౬౦
ఉ॥ అంతటనంతటన్ శితములై వెలుఁగొందెడి యినుపమేకులన్
క్రొంత మిఁకొక్క నారకము కానఁగవచ్చెడి. నందులోన స్త్రీ
సాంతలు గేహదాహకులు నంతకకింకరతాడ్యమానులై
భ్రాంతిఁ జరింత్రు వారు. దశమమాసికమా నరకార్తి మాన్పెడిన్. ౩౬౧
ఆ॥ అంత నిప్పుకుప్ప లంతట వ్యాపించి క్రాలు నేలయొకటి కానఁబడెడి.
నందు నెందుఁ దిరుగుచుంద్రు స్వామిద్రోహు. లదియుఁ బదునొకండవది హారంబు.
ఉ॥ ఆదటఁ దప్తమైన యిసుమంతట గల్గిన దుర్గతిన్ ధరి
త్రీదయితుండు వచ్చెనని దిక్పథంబునఁ బాఱిపోవు స్వా
మ్యాదులు పచ్యమానులయి మ్రాక్షలి వ్రాలుచునుందు రెంతయున్
ద్వాదశమాసికంబునను దానికిఁ గల్గు విముక్తి ధర్మజా! ౩౬౩
తే॥ అన్వయజాలిదు నేకొంచె మన్నరసము లేక యుదకంబొ కోరిలుచు నీకగతిని
హాయనము పూర్తియగుదాఁక నర్ధ్వమందె మృతులు వసియించుచుందురు మేదినీంద్ర!
ఆ॥ అబ్దపూర్తియగుడు నాత్మశుభాశుభకర్మములకుఁ దగిన ఘనఫలముల
ననుభవించుకొంచు నల ధర్మరాజు సంతికమునను వసింత్రు గకుటిలాత్మ! ౩౬౫
తే॥ అట్లు పదియైదునిరయంబు లనుభవించి మరల జన్మించెదరు వారు సుహితులగుచు.
నితరదేశంబునం బుట్టు హేతువాది. నిత్యతర్పణమున నతని కగుఁ దృప్తి. ౩౬౬
కం॥ స్వామిద్రోహరతప్రజ భూమీశ! కురాజ్యమందుఁ బుట్టును. హంత్ర
గ్రామమున కిడినదానం బామును సంతృప్తి గాంత్రు తత్పంచజనుల్. ౩౬౭
కం॥ పితృదేవద్విజుల కనర్పితభక్తుండగుచుఁ దిన్న పిసిని జనించున్
పతదుర్భిక్షంబగు భువి. మృతదివసశ్రాద్ధమునను దృప్తుం డతఁడౌ. ౩౬౮
ఉ॥ ఒండొరు సానురాగులయి యుండెడి దంపతులన్ దురూహ్యమై
గొండెముల న్వచించి విడఁగొట్టెడి దుర్మతి భార్య చండియై
యొండనినం బదంచు సతి మూఁరఁ జరించుచు గర్హ్యమానయౌఁ
బాండవ! కన్యాధార సుఖభాక్కులఁ జేసెడి వారి వెండియున్. ౩౬౯
శా॥ కన్యావిక్రయకారి కన్యనిడ విఘ్నం బెంచువాఁడున్ సదా
కన్యాసంతతితోనె యుంద్రు. సుతుఁ డొక్కండేని గల్గండు, త
త్కన్యల్ భాగ్యవిహీనలున్ విధవలై కావింత్రు జారత్వ. మా
కన్యాదానమె వారి కందతికి సౌఖ్యంబీ సమర్థంబగున్. ౩౭౦
తే॥ గ్రంథచోరుఁడు రత్నతస్కరుఁడుగూడ నధముఁడుం గుంటి గ్రుడ్డియుఁ నగుచునుందు.
గ్రంథదానంబువలనఁ దత్కల్మషంబు నీఁగి సుఖముండఁగలరు. వారు ధరణినాథ!
కం॥ ఇవి మర్త్యలోకనరకము. లవగతముం జేయుఁజూ శుభాశుభముల ని
ర్వ్యావి. తీర్థసేవనంబున నవు వీనికి శుద్ధి ధర్మజా!" యని యనుడున్ ౩౭౨

క॥ జలజాప్తుఁడు వృషభంబున మెలఁగఁగ జలధేను వటులె మృగశీర్షమునన్
జెలఁగఁగఁ దిలధేనువు విప్రుల కొసఁగనివాఁడు కనఁడుపో నిరయంబున్. ౩౮౫

క॥ సోమమున సోమనాథుని సోమగ్రహపర్వమునను జూచినవాఁడై
నేమమున నబ్ధిఁగ్రుంకిన యామనుజుఁడు నిరయబాధ నందఁడు తనయా!

క॥ రవి రాహుగ్రస్తుఁడుగా రవివాసరమందుఁ బోయి రహిఁ సన్నిహితీ
భవద కురుక్షేత్రములం దవగాహనసేయఁ దొలఁగు నటు నరకంబుల్.

తే॥ కృత్తికాయుక్తయుత కార్తికికి నెవండు కలితమానతఁ జని త్రిపుష్కరమునకును
దాఁ బ్రదక్షిణ మొనరించు తన్మనుష్య నయనములలోనఁ బడదుపో నారకంబు.

సీ॥ బురదలోఁ దిగఁబడి యఱచుచుండినయట్టి యావు నీవలకీడ్చ నలసినమతులు
నతిదైన్యవశత బ్రాహ్మణికిఁ దటస్థమౌ దాస్యంబుదొలఁగించు ధర్మరతులు
దొంగలచేఁ జిక్కి యంగలార్చుచునుండు నార్యుల విడిపించు శౌర్యధనులు
హంతకుఁజేతియం దర్పితప్రాణుఁడౌ భూసురుం గాపాడు పుణ్యతములు
నరకగాములగుచు నవయ" రంచని యిట్లు పలికె భీష్ముఁడనుచు భర్తృయజ్ఞుఁ
డానతిచ్చె నట్టు లానర్తభూపాలమణికి రోహితాశ్వమనుజనాథ! ౩౮౬

—* జలశాయి యుపాఖ్యానము *—

వ॥ అని మార్కండేయమహాముని శ్రాద్ధకల్ప మంతయు వక్కాణించె. నట్లు నాగబిలద్వారంబున జనార్దనుండు జలశాయియై వర్తించెడిఁ. బావనంబగు తద్బిలద్వారంబునం గ్రుంకి శేషపర్యంకశయను సేవించు జనుం డాజన్మమరణపాతకంబునుండి ముక్తుండగు. వార్షికంబులగు చతుర్మాసంబులును సరీసృపశయానుఁడగు జనార్దను సభక్తికంబుగా సమర్చించిన జన్మరాహిత్యంబగు. మును పచట మునీశ్వరులు మురరి పుందుఁ బూజించి తత్స్థలస్థ మృత్తికాగ్రహణంబున వైకుంఠంబునకుఁ జనిరి. చాతుర్మాస్యాకృత జలశాయిసేవనంబున సకలతీర్థస్నానఫలంబును సకలయజ్ఞాచరణఫలంబును సంప్రాప్తగోగ్రహమృత్యుఫలంబును బడసెదరు. మఱియును ౩౮౭

సీ॥ ఎపుడుఁజూచిన నొడ్లయిల్లాండ్ర కౌఁగిళ్ళ మనుచుండు పరమదుర్మార్గుఁడేని
యెట్టిబ్రాహ్మణుఁగూడఁ దిట్టి సహింపమిం గట్టి కొట్టి వధించు కటికమైని
యేనాఁడుఁ గలుద్రావి మేనెఱుంగక వీథిఁ బొరలాడుచుండు దుష్పురుషుఁడేని
యేయింతియైనను నిష్ఠురాల్గానిచోఁ గుతికెరొత్తిడి మహాక్రూరుఁడేని
నాల్గునెలలు జీవన శయాను సేవింప నార్యులార! ముక్తులై రహింతు"
రనుచుఁ జెప్పుటయును నా శౌనకాదిమునీంద్రు లంద ఱతని కిట్టులనిరి. ౩౮౮

ఆ॥ "పాలకడలిఁ బాపపాన్పుపైఁగద హరి యోగనిద్రవశత నుండుననుదు
రెట్టు లమ్మహాత్ముఁ డీబిలద్వారమం దయ్యె నుదకశయనుఁ డార్య! మరల?"

క॥ అని మనమున సంశయపడి తను నడిగెడి యమ్మునీంద్రతతిఁ గనుఁగొని పెం
ల్లన రోమహర్షణాహ్వాయతనయుండగు సూతుఁ డపుడు తా నిట్లనియెన్. ౩౯-౧

వ॥ మహాభాగులారా! యయ్యది సత్యంబ. యాదేవుండు బిలద్వారంబున జలశాయియై చతుర్మాసంబులును సంపూజితుండై జనుల ననఘులం జేయుం దెఱంగుఁ జెప్పెద సావధానులరై యాలకింపుఁడు. తచ్చతుర్మాసంబులును ముఖ్యంబులగు యజ్ఞోద్వాహాదికార్యంబు లొనర్ప ననర్హంబులు. దేవాదిదేవుండును నిర్గుణుండును గుణాత్మకుఁడును నవ్యక్తుండును నప్రమేయుండును సర్వదేవమయుండును సర్వజ్ఞుండును గిరీశుండును సర్వభూతాత్మకుండును నగు మహానుభావున కంజలిసేసి యయ్యది కీర్తించెద. తొల్లి నరసింహావతారమెత్తి విష్ణుండు వేని వధించె నామహాసురుండు హిరణ్యకశిపుండునా భయంకరుండై యుండ వానికి వీర్యమం దప్రతిములును సర్వలక్షణలక్షితులును నై ప్రహ్లాదుఁడనియు నంధకుఁడనియు నిరువురు సుతు లుదయించి రంతఁ గొంతకాలంబున కారాక్షసుండు పరలోకగతుండుఁగా దేవతలు తద్రాజ్యంబునఁ బ్రహ్లాదుఁ బట్టభద్రుఁజేయ నుంకించుటయుఁ బిత్రుపైతామహంబైనసమాగతంబగు నారాజ్యంబుఁజేయుట కతఁ డియ్యకొనఁడయ్యెఁ దత్కారణంబు వచింతు వినుండు. రక్కసుల కందఱకుం జక్రితో సదా విరోధంబు. ప్రహ్లాదుఁడట్లు ద్వేషింపక దానవులం ద్యజించి స్వరాజ్యంబు సహితము సల్పనొల్లక విష్ణునాశ్రయించె. నంత విష్ణుద్వేషపరాయణులగు నాతుఁద్రగక్షస్సులు పిత్రుపైతామహమగు రాజ్యమం దంధకు నభిషేకించిరి. వాఁడును వనజాసను నారాధించి యాచంద్రార్కస్థాయి యగు నమరత్వంబు నార్జించె. వరబలంబున వాసవు విరోధించి సమరంబున జయించి యజ్ఞభాగంబు లపహరించె. నాత్మీయసహితంబుగా నమరావతికిం జని హరిహయుం బాఱఁదోలి యమరాలయం బగ్గంబుసేసికొనియె. సర్వదేవసహితంబుగం జని శక్రుండు శంకరు సంసేవించి పెద్దకాలంబున కప్పినాకి ప్రీతుండై యేమికావలయుననిప్రశ్నించుటయు ౩౯-౨

ఆ॥ "అస్మదీయరాజ్య మధ్వరాంశములతో నంధకుఁడు హరించె నతిశయించి.
వానివలన మగుడ దానినిహరియించి కరుణసేసి నన్నుఁ గావుదేవ!" ౩౯-౩

వ॥ అని దీనంబుగాఁ బలుకుటయు భగవంతుఁడగు ప్రమథాధిపుఁడు త్రైలోక్యరాజ్యంబు భవదధీనంబుసేతు నుండుమని యూఱడించి ౩౯-౪

ఆ॥ "నాదు మదలయయ్యె. నాకంబువిడిచి నీ పిత్ర్యమైన రాజ్యపీఠ మెక్కు.
మధ్వరాంశములకు నాశింప కవనికిం జనుము. చనకయున్నఁ జచ్చెదీవు" ౩౯-౫

## — *అంధకాసురుఁడు శంకరునాజ్ఞ యుల్లంఘించుట.* —

వ॥ అని గణనాథుఁడగు వీరభద్రుముఖంబున నంధకునకుం జెప్పిపంపుటయు నమ్మహాబలుండు నవ్వి ౩౯౬

తే॥ "దూత వధియింపఁదగమిని దుష్ట! నిన్ను విడిచితిని బ్రాణములతోడ నడువుమింకఁ
దప్పు దెలియక యీరీతిఁ జెప్పిపంప నెవ్వఁ డాశంకరుండు? నన్నెఱుఁగఁడొక్కొ?

క॥ ఎఱిఁగియుఁ జాఁదలఁచి యిటుల్ మొఱఁగుచున్నాఁడొ? తెలిసెఁబో మనమున నా
మొఱకుఁడు నిజజీవితమున నిరాశుఁడయి యున్నవాఁడు నిశ్చయముగఁ దాఁ.

సీ॥ ఎవ్వానిముఖమున నెపుడు దరిద్రదేవత తాండవంబాడుఁ గుతుకమునను
నెవ్వానిచేతను నేభోగమేనియు ననుభూతంబు రవంతయేని
యెవఁడు జగత్త్రయి నెటఁజోటుదొరకక యల శ్మశానంబునం దాటలాడు
నెవఁడు సుగంధవద్భవవస్తువులులేక వెలిబూది మెయినిండ నలదుకొనును
నెవఁడు కరచరణాదులౌ నవయవములఁ బాములం జుట్టుకొని దిగంబరతఁ దిరుగు
వాని కిఁక జీవితముతోడి పని యదేమి? యందునసె నన్నుఁగూర్చి యిట్లన్నవాఁడు.

ఆ॥ కాన వేగనేగి కైలాసమును వీడి కాశిఁదపము సేయఁ గడఁగుమనుము.
విభవసహితముగను వృషున కాకైలాసధరము నా సుతునకు దత్తమనుము. ౪౦౦

ఆ॥ ఏతదస్మదుక్తి యెంతయుం బాటించి సరవి నవ్విధంబు జరుపుమనుము.
జరుపకున్నఁ దన్ను శత్రుని వధియింతుననుము. బుద్ధిగలిగి మనుము. చనుము."

వ॥ అని వాక్రుచ్చుటయు వీరభద్రుండు పదింబదిగ భర్త్సించి కడుంగడు కోపంబునఁ గైలాసంబునకుఁ బరువెత్తి క్రతుధ్వంసి కావార్తలు వినిపింప నతండు క్రుద్ధుండై యఖిలగణంబులతోడను హరిహరాద్యఖిలామరులతోడను వృషభారూఢుండై వెడలి యమరావతి కరిగె. నదిగని యంధకుం డానందంబున నర్జునాశ్వయూతంబగు నరదంబు నధిష్ఠించి యనీకినీసహిత మభిముఖుండై నిలిచె. నంత నాహవం బారబ్ధమై వేయియేండ్లు నడచుటయు దినక్రమంబుగా దేవతాసైన్యంబె క్షీణించెఁ గాని రక్కసులు చెక్కుచెదరరైరి. కడకంతఁ డంతఁ గనులెఱ్ఱఁజేసి త్రిశూలంబుచే వ్రేసినను బ్రహ్మవరప్రభావంబునఁ బ్రాణంబులం బాయక యంధకుండు మగుడ నాయోధంబునకుం గడంగి యనేకగణంబుల నలయించి గదాఘాతంబుల ఖండపరశువుం బలువారంబులు నొప్పించుటయు నది యఖిలలోకభయావహంబై కనుపట్టె. నంత నంబుజాసనవరప్రభావంబున నంధకునకు మృత్యువులేకుంట యెఱింగి యష్టమూర్తి శూలాగ్రంబునఁ బొడిచి గగనంబునకు లేవనెత్తి ఛత్రంబుం బోలె ధరించుటయు నధోముఖంబుగా వ్రేలాడు నాత్మాంగంబునుండి యవనిపైఁబడు నఖండరక్తధారలం బ్రబలిష్ఠధాతుచతుష్టయుండును జర్మాస్థిస్నాయుశ్శేషుండును నై యాపీనుండు

## అంధకుఁడు భృంగిరిటియనుపేరి శివభక్తుఁడగుట

శా॥ “ఈశ్వర్యసమన్వితుండవని నిన్నె గుర్తెఱుంగక విభూ!
ప్రాదుర్భూతమదాంధతం దఱచు దుర్భాష ల్ప్రసంగించితిన్.
నా దౌరాత్మ్యవివేకహీనతలకున్ న్యాయ్యంపు శిక్షాక్రమం
బో దేవేశ్వర! నీ యొనర్చ్పని. యెంతో శ్లాఘ్యమై యొప్పెడిన్. ౪౦౩

తే॥ నీతిరహితున కొదవు విద్యాతిశయము సిరియుఁ జిరకాల ముండవు. సిద్ధమిద్ది.
అతిమదాంధుఁడనగు నాదు నలఘుబలపరాక్రమైశ్వర్యరాజ్యసర్వస్వమట్లు. ౪౦౪

తే॥ పాపకర్ముఁడఁ. బాపుఁడం. బాపభవుఁడ. మఱియుఁ బాపాత్ముఁడను నేను గరళకంఠ!
అఖిలపాపహరుండవై యభవ! నీవు నన్ను రక్షింపుమయ్య. నిన్ సన్నుతింతు ౪౦౫

సీ॥ కాలంపుప్రేట్లకుం దూలిపోయి కరంబు శోకాకులిత మానసుండనైతి.
నధమాధముండనై ప్రధనంబునను నీదు చేతిలోపల వచ్చి చిక్కుపడితి.
నధికతరైశ్వర్య మంతయుం గోల్పోయి దీనత్వమున నీవె దిక్కటంటి.
భాషించుటకుఁగూడ బలములే కెంతయుం బార్శ్వభాగంబుల వ్రాలుచుంటి.
నిట్టి యీపన్ను రక్షింపవే మహేశ! శరణుచొచ్చితి. మనసు నీచాయతిరిగె.
సర్వపాపక్షయంబైన సమయమందె భవునిమీఁదికిఁ జిత్తంబు పరువులెత్తు.

తే॥ శివుని బూజింపనటువంటి చెనటిప్రజకు వచ్చిపోయెడిదినములే చచ్చిపోవు
వారలకుఁగూడఁ గ్రమముగా వచ్చిపోవు బ్రదికియుండిన యటువంటి ప్రజకె కాక.

సీ॥ చెడు కుష్ఠగదమునం జేసి యత్యంతంబు మేనెల్లఁ జెడిపోవువానికేని
తెగులుగొంటయి సదా తీఱని వ్యథతోడ వర్తించునటువంటివానికేని
యంఘ్రిలోపమున నొక్కడుగిడుటకునైన వశముగా కల్లాడువానికేని
సవిధంబునందగు శంఖధ్వనుల్గూడ వీనులంబడనట్టివానికేని
యెవనిచేతఁ బరమశివుఁడు దైవతబుద్ధిఁ గొలువఁబడఁడో వానికులమునందుఁ
గలుగకుండుఁగాక కటకటా! జన్మంబు పార్వతీశ! సకలపాపనాశ! ౪౦౬

సీ॥ విడిచినాఁడను నేను వివిధాఘములకును నాదికారణమైన యసురభావ.
ముజ్జగించినవాఁడ నొకమాఱె త్రైలోక్యరాజ్యంబుగూడ విరాగినగుచు.
వదలిపెట్టినవాఁడ వాస్తవంబుగ నాదు పుత్రపౌత్రుల బుద్ధిపూర్వకముగ
నవలఁద్రోసినవాఁడ నష్టవిధైశ్వర్య మగ్నిసాక్షిగఁ బెండ్లియైన స్త్రీల.
ముట్టుకొని నీదు పదపద్మములను సరిగ మూఁడుపరులు వచించుచున్నాఁడ రూఢిఁ.
గాన నను విశిపించి సత్కారుణతోడ స్వాగతంబొనరింపుమీ సాంబ! యింక,”

వ॥ అనినవిని గతకల్మషుంగా నెఱింగి శూలంబునుండి మెల్లనదించి వినయ
వినమితగాత్రుండగు నాతనికి భృంగిరిటియని స్వయంబుగం బేరువెట్టి ౪౧౦
తే॥ "నందికంటెను మఱి గజాననునికంటె నస్మహాకాళుకంటెను నగ్గలంబు
వల్లభుండవైతి నాకు. నీవారిఁ దలఁచుకొనక సుఖముండు నాతోడఁ గొడుక! నీవు"
వ॥ అని వక్కాణించుటయు వాఁడు వల్లెయని నమస్కరించి గణంబులం జేరి
శంకరు నాశ్రయించి యుండె. నంతఁ దత్తనయుండగు వృకుండు నిరుత్సాహుండై
మహాభయంబున మాతృశేషులం గూడుకొని యంభోధిం బ్రవేశించె. సంక్రందనుండు
సంతోషంబున శంభునకు జోతవెట్టి తదాజ్ఞం గైకొని యమరావతి కరిగి ముజ్జగంబు
లేలుచు హవిర్భాగంబు లనుభవించుచుండె. వృకుండు సాగరంబు వెలువడి జంబూ
ద్వీపంబున కేగి తండ్రి తపముండిన హాటకేశ్వర క్షేత్రంబు సిద్ధిప్రదంబని తలంచి
యొరులెవ్వరును నెఱుంగకుండ బ్రహ్మను ధ్యానించుచు వాయుభక్షకుండై కొన్ని
యేండ్లును జలాహారుండై కొన్నియేండ్లును జితేంద్రియత్వంబునఁ బుడమిపయి బొట్టన
వ్రేలు మోపి తపంబొనరించుటయుఁ గమలాసనుండు సంతుష్టుండై తపంబునకు
మెచ్చి గర్తామధ్యగతుండగు వాని డగ్గఱి ౪౧౨

—♦ వృకుండింద్రపదవిం బొందుట. ♦—

క॥ "ఓహో హో వృక! యిఁక నతిసాహసపదమైన తపము చాలింపుము. నీ
యీహితమైన వరంబెదో వ్యాహరింపు. మిడిపోవ వచ్చినవాఁడ" ౪౧౩
వ॥ అని పలుకుటయు వాఁడిట్లనియె. ౪౧౪
క॥ "తుష్టింజెందితివేని మదిష్టంబగు వర మొసంగ నేతెంచితివేఁ
గష్టంబని భావింపక నష్టజరామరణుఁగాఁగ ననుఁ జేయుము విధీ!" ౪౧౫
వ॥ అనియిట్లు కోరుటయు విధాత ౪౧౬
ఆ॥ మత్ప్రసాదమునను మరణంబు జరయును నీకు సంభవింప వో కుమార!
యేమొ యనియెననుచు నీవిషయంబున సంశయింపఁబోకు. సత్యమిద్ది." ౪౧౭
వ॥ అనివాక్రుచ్చి యదృశ్యుఁడగుటయు వృకుండు కృతకృత్యుండై సర్వర్తు
కుసుమోజ్వలంబగు రైవతగిరికిఁ జని నిజామాత్యులతో యోజించి త్వరితంబుగా దైవ
తేశుపైకి దండెత్త నతండు వాని బ్రహ్మవరంబున జరామరణవర్జితుంగా నెఱింగి
సర్వసుపర్వసహితంబుగా సత్యలోకంబునకుం జనియె. మహాబలుండగు వృకుండు
సంతసించుచు ససైన్యపరివారంబుగా స్వర్గంబుం బ్రవేశించి దేవరాజ్యపదంబున
ఋషులచేఁ బుష్పోదకంబుల నభిషిక్తుండై హవిర్భాగంబులందఁగా వసురుద్రాదిత్య

మరుత్ప్రముఖదేవతాస్థానంబుల నసురుల నెలకొల్పి యథేచ్ఛ జగంబుల శాసింప మొదలిడిరి. బలవీర్యధైర్యామర్షంబుల వాఁ డంధకునకు వేయిరెట్లధికుండై లోకంబుల క్షోభింపఁజేయ నదియెఱింగి జను లెవ్వరును యజ్ఞయాగాదులు చేయమానుకొనిరి. యెవరేని చేసిన నమరసంతృప్తికిఁగా నతిగుప్తస్థలంబునం జేరి యాచరించెడివారు. స్వర్గతులగు రాక్షసులు భూలోకంబునం దమ్ముఁ గూర్చి హవిస్సులిచ్చువారు లేకునికికి సందేహించి. రంత వృకుండు కుపితుండై ౪౧౮

—* ఏకాదశీవ్రతమాహాత్మ్యము *—

క॥ "ఎవడేని వేల్పులకుఁగా నవనీస్థలి దానహోమయజనంబులఁ జా
సవిధి నొనరింపఁ గడఁగిన నవలీలం జని వధింపుఁ డస్మ దనుజ్ఞన్"

వ॥ అని యానతిచ్చుటయు బలవంతులగు పలలాశను లిలాతలంబునకు దిగి గుప్తంబుగా సర్వత్రి సంచరించుచు జపహోమస్వాధ్యాయ పరాయణుఁ డెవఁడేని కనఁబడినఁ గఱుకత్తులం దత్తిగిస్థైచుచుండి. రట్టియెడ సాంకృతియను మునివరుండు తొల్లి వృకుండు తపించిన బిలంబున ఘన్నవిగ్రహుండై గుప్తంబుగం దపంబు సేయఁ బరుపాకురంబుల భక్షించుచు సమీపించి తదగ్రంబున గంధపుష్పాక్షతలం బూజితమై హస్తచతుష్టయంబుచే నలరారు హరివిగ్రహంబు నవలోకించి యాయుధంబుల యమివరేణ్యుఁ బ్రహరించుటయుఁ దళతళమను తదాయుధంబులు మొక్కవోయి చంపసమర్థంబులుగాకునికిని వారు వైలక్షణ్యంబువొంది వృకునికడ కేగి ౪౨౦

తే॥ "ఒక్కబాపఁడు తొల్లి దివౌకసులకు జడిసి నీవు తపంబున్న స్థలమునందు
హాటకేశ్వరమున విష్ణునర్చ తనదు నగ్రమున నిల్పి యొంటిమై నధికనిష్ఠ ౪౨౧

తే॥ తపము సేయుఁగఁ గనుగొని యపుడు మేము మొత్త మొత్తంగఁ గత్తులే మొక్కవోయెఁ
గాని యాతని మెయి కసుగందదయ్యె. నెద్ది యుచితమొ యదిచేయుము మింక నీవు"

వ॥ అనినవిని వృకుం డాగ్రహంబున రయంబ తత్సవిధంబున కరిగి కృష్ణవిగ్రహంబును గుహాయవలికిం జిమ్మివైచి పదింబదిగ నదలించుచు నీకాల నాకాలం దన్ని

క॥ "నాకుం బగవాఁడగు నల వైకుంఠు భజించువాఁడు వధ్యుఁడు నాచేఁ
గైకొందు దొంగతనముగ నా కేశవుఁ గొలుచు నీదు నసువుల నింకన్" ౪౨౪

వ॥ అనిపలికి ఖడ్గంబున వ్రేయుటయు నది పదనుగలదయ్యుఁ దద్గాత్రంబునకుఁ దగిలి నూఱుముక్కలయ్యె. నంతతో విడువక యత్యాగ్రహంబునఁ దత్సాంకృతినామక భూసురశ్రేష్ఠుండు ౪౨౫

ఆ॥ "కాళ్ళు రెంటితోడఁ గడు దౌష్ట్యమున నీవు నన్నుఁ దన్నెదవుర యున్నపోత !
మరలఁ దన్నకుండ విఱుగుఁబో నీకాళ్ళు యీక్షణంబ సారసాక్షు కరుణ" ౪౨౬

వ॥ అని యనునంతమాత్రంబునఁ బంచశీర్షంబులగు పన్నగంబులుంబోలె వాని కాళ్ళు రెండును విఱిగి ధరం బడుడుఁ దత్సైన్యంబులును విశేషించి తదీయజనంబులును రుదితంబు లొనరించిరి. త్రిదశాలయు లడివిని పదింబదిగ నేతెంచి తదనీకిని పయిం బ్రదరంబులు గురియుటయు హతశేషు లగ్రలోకం బాశ్రయించిరి. వృకుండు కుంటియై వెలందులుం దానును వెక్కి వెక్కి యేడ్చి పెండియు విరించినిగురించి తపింప మొదలిడియెఁ. బాకశాసనుండు ప్రాప్తరాజ్యుండై ప్రణష్టకంటకంబుగం బరిపాలించె. ధరాతలంబున మరల ధర్మకార్యంబులు ప్రవృత్తంబులయ్యెఁ. సిద్ధకాలంబునకుఁ బితామహుండు ప్రీతుండై వివరమధ్యగతుండగు వృకు సమీపించి ౪౨౭

క॥ "వృక ! మెచ్చితి నీతపమున. కోకఁ దడయక యిష్టవరము లిచ్చెద. శంకం
బక దుర్లభార్థమేనియుఁ బ్రకటింపుము హృదయగతము భయపడకుండన్" ౪౨౮

వ॥ అని వక్కాణించుటయు వాఁడు ౪౨౯

క॥ "తుష్టుండవైతివేని యభీష్టము నెఱవేర్చెదేని యిప్పుడె యస్మ
న్నష్టాంఘ్రులు దయసేయుము. కష్టించుచునుంటిఁ గుంటికాళ్ళఁ గగంబున్"

వ॥ అనినవిని వనజాసనుండు వానిం దోడ్కొని సాంకృతి సవిధంబునకుం జని సాంత్వపూర్వంబుగా నిట్లనియె. ౪౩౧

క॥ "నావాక్యము పాటించుచు నీవృకు పంగుత్వ మపనయింపఁగ వలయున్.
గావలఁడే యగునుగాక మహావిబుధ ! యనుగ్రహింపవె యెట్టులైనన్" ౪౩౨

వ॥ అనవుడు సాంకృతి ౪౩౩

తే॥ "ఇష్టగోష్ఠులయందేని యెపుడు నేను బలికియుండఁగ నబద్ధ మోభగవతీశ !
యట్టినియతవ్రతంబు నేఁ డిట్టు మరల విడిచి పెట్టంగవలయునో నుడువు మీవ"

వ॥ నావుడు దేవజ్యేష్ఠుండు పెండియు నిట్లనియె. ౪౩౫

ఆ॥ "భక్తుఁ డీవృకుండు పాత్రుండవీవు నా. కగ్గలంబు ప్రియుఁడ. వట్లుగాన
నసఘ ! యుష్మదుక్త మనృతంబుఁజేయలే కిట్లు వేడుచుంటి నేను నిన్ను" ౪౩౬

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు నమ్మునీశ్వరుండు ౪౩౭

తే॥ "వీఁడు దుర్మార్గుఁ డెంతయు. వేల్పులయు విశేషముగ నాదుగురుఁడైన శ్రీధరునియు
నహితమున నుండువాఁడు. కుంటియవసింప నర్హుఁడగు. ద్విజద్రోహుఁ డధికపాపి.

తే॥ జరయు మరణంబు లేకుండ సల్పితీవ. యట్టి బలవంతునకుఁ గాళ్ళు నమరునేని
నరసురాసురసహితమైన జగమెల్లఁ బాడుసేయంగఁగడఁగడు వీఁడు నేఁడు. ౪౩౮

ఆ॥ కాన నుండనిమ్ము కార్శ్యలేకుండనే జరుపకుము వికల్ప మరసి మరల.
ముజ్జగములు సౌఖ్యముగనుండఁ జింతింపవలయు నీవుఁగూడఁ దలపునందు ”

వ॥ అనివచించుటయుఁ దమ్మిచూలి మఱియునిట్లనియె. ౪౪౧

ఆ॥ “ వానకాలమునం బ్రయాణంబు దుర్ఘటం, బందు మొదలె కుదుర దాహవమున.
కెండకాలమునను హేమంతమునసె నిరంతరాయమునను నది పొసంగు. ౪౪౨

తే॥ అట్లుగావున వార్షికంబైన నాల్గునెలలు వృత్రునకుఁ బాదము ల్గలుగునెపేల
నప్పు డఖిలజగంబుల కరుగలేక తగుపను శ్లేసికొనుచు స్వస్థలి వసించు. ౪౪౩

ఆ॥ కాన దానవేంద్రుఁడైన యీవృత్రుఁడు దాఁ గార్శ్యగలిగియుండుఁగాక యపుడు.
దేవతలకు భూమిదేవతలకు దీన నొలయఁ బాధ లెవియు నుండఁబోవు. ౪౪౪

క॥ ఏవంవిధముగ నగుచోఁ దావకమైనట్టివాక్కు తథ్యంబునుగా.
దీవృత్రుఁడు నన్నుఁగూరిచి కావించిన తపము వితగాక ఫలించున్ ” ౪౪౫

వ॥ అని యిట్లు పలికి మహాత్ముఁడగు తత్సాంకృతుచేఁ దథాస్తనిపించుటయు వృత్రునకు వెండియుఁ జరణంబులువచ్చె. శీతాతపసమయంబులఁ జెలియలుం దానును దక్కుంగల బంధుగులును బర్హిర్ముఖులతోడి బలువిరోధంబునం బలవరించుచుఁ బడియుండినను జలదాగమంబుగల చతుర్మాసంబులును భయంకరుండై ౪౪౬

సీ॥ వేధించు నీర్ష్యమై వృథశ్రీవోముఖ్యబృందారకులను దత్సుందరులను.
బాధించు నలుకమై బ్రాహ్మణప్రముఖాఖిలావనీజనముల ననఘుతముల.
శోధించు బలిమిమై క్షోణిఁ గూలందోసి పట్టణంబుల నెల్ల పల్లియలను.
ఛేదించు వీఁకమైఁ జెట్టుకొట్టియుఁబీడ కుద్యానవనముల నుటజములను.
నివ్విధమునఁ బెట్టు నిడుములు పడలేక క్షీరవారినిధిని శేషశయ్యఁ
బవ్వళించియుండు పద్మాక్షునుదండ నానెలలు నాల్గు గడపి నిర్జరాళి ౪౪౭

వ॥ వెండియు వృత్రాసురుండు విగతపాదుఁడగుటయు నష్టమాసంబులును హర్షాన్వితులై యమరావతి నలంకరించుచుండి. రట్లనేకాబ్దంబు లరుగుడు నాషాఢ మాసాంతంబున హరిహయుండాచార్యు నాలోకించి ౪౪౮

పృథ్వి॥ “ గురూ! మరల వర్షముల్ గురుయావేళ వచ్చెన్. వృత్రా
సురుండు ధృతపాదుఁడై సురలపై, బడున్ రౌద్రతన్.
సరీసృపశయానుఁడో సరసిజాక్షు నొద్దం బయ
స్సరిత్పతి వసింపఁగం జనఁగనో నికన్ వేలుపుల్.

సీ॥ గగనభాగస్థ ప్రాకారావృతములైన చంద్రకాంతోపలసౌధములను
హంసతూలికలపై నమరుపంబడిన హొంబట్టుదిండ్లంగ్రాలు నుంచములను
రతనముల్తాపి స్వర్ణమున నిర్మితములై శయనీయమైన యాస్తరణములను
గలధౌతఘంటికాకలితంబులౌ గజవాజిముఖ్యవిచిత్రవాహనముల
నతిహితములైన యితరపదార్థములను విడిచి కడుదీనతం బురి వెడలిపోయి
సతతముఁ బరాశ్రయంబున వెతలఁబడుట మన కభావ్యంబగుంజుమీ మంత్రివర్య!
తే॥ కాన వహ్నీంద్ర! మామీఁదఁగరుణయుంచి వ్రతమొ హోమమొ నేమమో మతినిలెస్స
యోజనముచేసి వాత్రువ్వ మొకయుపాయ. మనుభవింపంగఁజాల మీయలజడులను.
తే॥ దేన స్వకళత్రశూన్యంబుగాని శయ్య స్వగృహముం బాసిపోవమి సంఘటిలునో
దాని వాత్రువ్వమయ్య స్వస్థానచలనమునను నిర్విణ్ణమయ్యె నామనసు మిగుల.
కం॥ ఏడాదికి నాలుగునెల లేడకొ భయపడుచుఁబోయి యిల నిజభార్యన్
వీడి యొకండఁ బరుండుచు నూడిగ పుంబ్రహ్మచర్య మొనరుపవలసెన్."
వ॥ అనినవిని బృహస్పతి తడవుధ్యానించి శతక్రతువున కిట్లనియె. ౪౫౫
తే॥ "విష్ణునారాధనముసేం టె విబుధనాథ! కల దశూన్యశయననామకవ్రతంబు.
దానిఁజేయుము క్షీరయాదఃపతిస్థుఁడైన యాహరి తీర్చు నీయభిమతంబు
ఆ॥ పట్టుపఱుపులందుఁ బవళించుచును నీదునిలయమందె యుండఁగలవు నీవు
సర్వశత్రువులును సమసెద రాజలశాయికరుణవలన సత్వరముగ" ౪౫౬
వ॥ అనియిట్లు వక్కాణించి యాయనచే నశూన్యశయనవ్రతం బాచరింపఁజేయుం
టయు భగవంతుండగు విష్ణుండు సంతుష్టుండై ౪౫౭
కం॥ "ప్రీతుండనైతిఁ ద్వత్కృతచాతుర్మాస్యవ్రతమున శతమన్యూ! నీ
చేతస్సునఁగలకోరిక నాతోఁజెప్పుకొను మిత్తు నాతోడింకన్" ౪౫౮
వ॥ అనుటయు నింద్రుండిట్లనియె. ౪౫౯
తే॥ "విష్ణుదేవ! దురాత్ముఁడౌ వృకునివలన నేనుబొందుపరాభవం బెఱుఁగుదీవు
నే నొకెన్మిదినెలలేల నేలు నాల్గునెలలు తానును ముజ్జగంబులను వాఁడు. ౪౬౧
ఆ॥ ఇట్లు తెలిసికొనుచు నెంతయు నామీఁదఁ గరుణయుంచి యెల్లకాలములును
నాకు రాజ్యముండుపేక విధింపుమీ యిందిరేశ! యసురబృందనాశ!" ౪౬౨
వ॥ అని యిట్లు వాకుృిచ్చుటయు విష్ణుదేవుండు [యుండఁ
తే॥ "జరయు మృతియును లేకుండ సల్పియుండె బ్రహ్మ వాని నిఁ కవ్వాఁడు బ్రదికి
నీవు త్రైలోక్య మెబ్భంగి నేలనౌను? నైనను హితంబు నీకునై యాచరింతు.

ఉత్సాహము॥ వానకాలు నాల్గునెలలు వాసవా! రమాయుతం
జేసి పాలకడలి వెడలి యేగి హాటకేశ్వర
స్థానమున శయించు నంతఁ దద్భరంబునన్ సదా
మేను సత్త్వలేక వాఁడు మిడుకు చుండ యుండెడున్. ౪౬౫

మ॥ ప్రతిసంవత్సర మిట్లునీవు హితమున్ భావించు చుండుండు. సం
భృత రాజ్యుండవు కమ్ము. పొమ్ము దివికిం. బ్రీతుండనై యుందు నీ
వతివ్యాపనయాంకాలంబును భయంబందంగఁబో కింక. నీ
వ్రతమంగుండు ననున్ గుణించి ప్రజ నిర్వర్తింప నిష్ఠాత్మకా" ౪౬౬

వ॥ అని యిట్లు వచియించి హృషీకేశుండు స్వరాజ్యపరివృద్ధిఁ బొందె నిశ్శేష భయుండగు నిర్జరేశుం బంపించి యేటేట నాషాఢశుద్ధైకాదశీదినంబున హాటకేశ్వర క్షేత్రంబున కరిగి సప్రియత్నభార్గవకంబుగా వృకాసురునైఁ బవళించుచుండుటయుఁ దదాక్రాంతుండగు వాఁడు భారాతిరేకంబునం బ్రిసిడితుండై చచ్చినట్లు పడియుండెడి. నాల్గు నెలలును నట్లుండి విష్ణుండు వెండియు బాహుళపు శుక్లైకాదశీతిథిం బ్రబుద్ధుండై పాలసంద్రమునకుఁ బయనంబు సేయుటయుఁ బలరాతి బ్రాహ్మణశాపంబునఁ బంగుఁడై పడియుండెను. నట్లు వారి యా నాల్గునెలలును నఘాత్ముఁడగు నసుర భయంబున హాటకేశ్వరంబునం దధివసించు. భగవంతుఁడగు యజ్ఞపురుషుం డప్పుడు పన్నెండి భాగంబును స్వీకరింపమి నవనీజనంబులచే నఖిలయజ్ఞక్రియలును నాచరింపఁబడ. వట్లున్న పాత్రిశన చూడాకర్మంబులు దప్పఁ గన్యాదానాది నిఖిలశుభకార్యంబులును నిషిద్ధంబులు. జగన్నాథు శయనసమయంబున సలుపంబడు సకలశుభకర్మంబులును వ్యర్థంబు. లయ్యవసరంబునం దాచరించు వ్రతనియమంబు లధికఫలంబులగుట నత్యంతయత్నంబున హరిసంతృప్తికై వ్రతస్థులగునది. శయనబోధనైకాదశీదినంబుల జరుపంబడు యత్కించిత్కర్మంబును నక్షయఫలంబగు. నహాన్యశయనవ్రతంబె యాచరితంబుగా నడుగవలసియే యుండు. దనుగనై శయనించు నంబుజనాభుఁ డద్దాని కనంతఫలంబె యొసంగు. నట్లుచటు శయనించిన యచ్యుతుండె యానతిచ్చెఁ. బాపాత్ముఁడై యెవఁ డయ్యేకాదశి నన్నంబుదినువానికి జ్వరమేని వచ్చియుండవలయు. లేదేని యేదేని వేదనయేని యేర్పడియుండవలయుఁ. గావున నెన్నివిధంబులఁ జూచినను నవ్యంబగు హరివాసరంబునఁగూడ నన్నంబు భుజింపఁజనదు. శయన బోధనైకాదశుల నిరశన నడుగనేల. వార్షికంబులగు చతుర్మాసంబులును వాసుదేవుఁ బూజించువాఁడు వైకుంఠంబున వసియించు. దానంబులవలనను నవ్యవ్రతంబుల

వలనను నుపవాసంబులవలనను వచ్చు విశేషంబు లేమింజేసి సుస్థిరుండగు సుదర్శన హాస్తుఁ బూజించునది” యని సూతుండు నుడువుటయు శౌనకాదులు

—— చాతుర్మాస్యవ్రతనియమములు ——

సీ॥ “ హరి నిదురించెడి యవసరంబున నింక నేయేవ్రతంబుల్గం జేయవలెనో
దైత్యారి శయనించు తఱిని గింకింపంత్రిజపముల నిష్ఠమై జరుపవలెనో
చక్రి నిద్రించినసమయము మెటువంటి హోమంబులం జేయుచుండవలెనో
విష్ణుండు పన్నుండువేళ బ్రాహ్మణులకు నేమేమిదానంబు లీయవలెనో
యిదియునుంగాక నియమంబు లెట్టివపుడు పట్టవలయునో చెప్పుమంచుఁ బ్రశ్న సేయు
టయును శౌనకాదిగ్రణిమైనసూతుఁ డెంతయును నాదరంబున నిట్టులనియె.

సీ॥ కలితస్వరాఢ్యావగాహాగ్రగణ్యకమైన యజురాది వేదపారాయణంబొ
యష్టాక్షరద్వాదశాక్షరప్రభృతులౌ ముఖ్యమహామంత్రముల జపంబొ
వటపలాశాశ్వత్థహానీరధవశార్క సమిధాజ్యచర్వాదికము హవనమొ
కల్పోక్తవిధ్యుతిక్రమముగాపుండంగ సాత్వికాహారమౌ సద్వ్రతంబొ
యేదొయొక్క నియమ మూఁదంగవలె మునీశానులార ! శార్ఙ్గిశయనవేళ
నద్ది కొంచెమయ్యు నగ్గలంబు ఫలించు నంచు మును విరించి యనుటఁ జేసి.

సీ॥ ఈనాల్గునెలలును నేకభుక్తము సేయ ధనము సమృద్ధమౌఁ దపసులార !
యీనాల్గునెలలు రేయి భుజింప సుమతియై సిరియు సురూపంబుఁ జెందుమనుజుఁ
డీనాల్గునెలలనౌ నేకాంతరోపవాసముల వైకుంఠధామము ఘటించు.
నీనాల్గునెలలు షష్ఠాన్నహాఆహారి రాజసూయా ద్యధ్వరఫల మొందు.
విన్మరశ్రీవుండు వృకుపైఁ బరున్న యీనాల్గునెలలు మూఁడునాళ్ళ కొక్క
పరి భుజింప మగుడఁ బడఁడుతా సంసారసాగరమున జనుఁడు యోగులార !

సీ॥ ఒకనాఁడు పవలు వేఱొకనాఁడు నిశఁ దిన్న నబ్బు నగ్నిష్టోమయజ్ఞఫలము.
యాచితేతరమైనయది పసాపడినచో నొలయదు బంధువియోగ మెపుడు.
నెయినూనియలు వెట్టి నెత్తింటుకొనకున్న స్వర్గభోగంబులు సంభవించు.
నష్టలద్బ్రహ్మచర్యమున వర్తించుచో దేవయానముమీఁదఁ దిరుగు దివిని.
నీరదావృతి నలరు నీనెలలు నాల్గునైని నూనియరాయక స్నానమాచ
రించి మధుమాంసములనువర్జించువాఁడు ముక్తుఁడేయగు సంయమిముఖ్యులార! ౪౨౦

సీ॥ శాకంబునందుండు శ్రావణమున బ్రహ్మ యటుగాన సంత్యాజ్య మప్పుడద్ది.
దధిలోననుండు భాద్రపదంబునం జక్రి. యట్లౌట విడువనౌ నపుడుదానిఁ.
బాలయందుండు నా శూలి యాశ్వినమున. దాన నపేయ మత్తఱిని నదియు.
నామిషమందుండు రమ్మవ్వరుం గార్తికమునఁ. గాబట్టి దూష్యమదియపుడు.

వానివదలువాని వత్సరకృతమైనయఘము వదలిపోవుననుచు మున్ను
చేయిరెత్తిచెప్పె స్వాయంభువుండైనమనువు శౌనకాదిమౌనులార! ౪౭౧

సీ॥ కంచు వివర్జించి కనుడు వాజపేయాతిరాత్రంబుల యధికఫలము.
నక్షారలవణాశియగు మహీసురుచేత నఖిలపూర్తములు చేయఁబడినట్లె.
స్వాహాంతవైష్ణవసన్మంత్రములఁ దిలాక్షతలు వేల్చినఁ గాఁడు జాడ్యయుతుఁడు
స్నాతుఁడై వైకుంఠుసన్నిధిఁ బురుషసూక్తముపఠించిన బుద్ధి తద్దపెరుఁగు.
మఱియు వార్షిక తచ్చతుర్మాసములును సఫలమౌ స్తుతమౌనిమై చక్రహస్తు
నూటయెనిమిదిసారులు నూటిగాను వలగొనినవాని కొలయ దేకొలయునేని. ౪౭౨

సీ॥ మేదినీసురులకు మృష్టాన్నమిడువాఁడు పొందు నగ్నిష్టోమపుణ్యఫలంబు
హరిమందిరాచరితామ్నాయపాఠుండు విద్వద్వరిష్ఠుఁడై వెలయఁగల్గుఁ
గజివేల్పుగుడిఁ గృతగానన్నృత్యవినోదిల సవిసేయుదురు దివి నప్సరసలు
అమరమాశ్చరితగీతాదిపుండగువాఁడు గంధర్వభావంబు గాంచితీరు.
వార్షికంబులగుచు వఱలు నాల్నెలలందో కడకు నొక్క కార్తికంబునందో
పట్టెదగు నరుండు ప్రాగుక్తనియమముల్ చేతనైన మౌనిసింహులార!

వ॥ అట్లుపట్టినను నిహపరార్థులగు విష్ణుభక్తులు కార్తికపూర్ణిమనాఁ డవి కావించునది. ౪౭౪

సీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన స్త్రీనేని కలియకుండుట మేలు కార్తికమున.
హుతశేషమైన యత్యుత్తమామిషమేని కడకుఁద్రోయుట మేలు కార్తికమునఁ
ప్రికగణాంతగ ముఖ్యభావ్యముండనమేని కావించుకొనమి మేల్కార్తికమున.
లాజాదికాత్యంతలఘుపదార్థంబేని క్రిమ్మఱఁదినమి మేల్కార్తికమునఁ.
గంచు వాడుకొనమి మేలు కార్తికమున. క్షౌద్రిరస మానకునికి మేల్కార్తికమునఁ
గార్తికంబున వీని త్యాగంబుసేయ నబ్బుఁ బూర్వోక్త సకల నియమఫలంబు.

వ॥ కార్తికమాసంబున జలశాయిదేవు ప్రాసాదంబుమీఁది కలశంబున దీపంబు పెట్టువానికిఁ గాంస్యాది షట్పదార్థత్యాగంబునఁగలుగు ఫలంబు చేకూరెడి. శుభార్థులు సుప్రాప్యంబును నిష్టతమంబును నైన దేనికేని చాతుర్మాస్యంబున నేమంబును బూనునది. నియమసమాప్త్యనంతర మదియే యవనీసురున కర్పించునది. శక్తికొలఁది నియమంబు చరించుటయును ఫలంబు సిద్ధించు. జపమో వ్రతమో నియమమో లేక చతుర్మాసంబులు గడపిన మూర్ఖుండు జీవించియు మృతుండ. కాకయవలుం దిలారణ్యంబులుం బోలె నమ్మానవులు నామమాత్రప్రసిద్ధులుగానఁ గడంకమైఁ గార్తికంబునఁ గొలఁదిపాటిదై

వ॥ కలియుగాంతంబున జను లంగుష్ఠమాత్రశరీరులై శౌచాచారంబులు వదలి యాత్మకార్యాసక్తులై వర్తించెదరు. వారి కందళికిని నెలుకబొత్తియు లిండ్లును గృమి వస్త్రంబు ప్రావరణంబును నయ్యెడిని. ౭౫౨

కం॥ పొందుదురు మ్లేచ్ఛభావము నందఱు నొకజాతియై దురాచారముతో.
నిందింతురు ధర్మకృతులను సందేహములేక రో రసాబుధులారా! ౭౫౩

వ॥ అంతఁ గల్కిగోత్రసముత్పన్నుండైన హరిపింగళుండను బ్రాహ్మణుం డవ్వారి నందఱ నంతంబునొందించు. తరువాత మగుడఁ గృతయుగం బరుదెంచెడి. ఇట్టి వేయియుగంబులు బ్రహ్మ కొక్కదివసంబు. మున్నూటయఱువదిదినంబులు సంవత్సరంబు. ఆసంవత్సరంబు విష్ణువున కొక్కదినంబు. తమతమ మానంబుల బ్రహ్మవిష్ణు లిరువురును నూఱేసియేండ్లు జీవింతురు. విష్ణుని సంవత్సరము శివుని కొక్కదినంబగు. అతండును నిజమానంబున నూఱేండ్లు మని యంత శక్తిరూపంబున నత్యుదయుండుగం గీర్తింపఁబడు. అట్టిశివుని శతవత్సరంబులును సదాశివున కొక్క నిశ్వాసంబయ్యెడి. అతని యుచ్ఛ్వాసంబున మగుడ శక్తిరూపంబున వర్తిల్లెడు. శంకరుని దినమానంబు నన్ను మీర లడిగితిరి. మానవాది సకలమానంబులును నేను మీకుం జె

—♦ యుగప్రమాణము ♦—

ప్పితిని. బ్రహ్మ కొక్కదినమునకుఁ బదునలుగు రింద్రు లయ్యెదరు. ప్రకృతమున్న యతఁ డేడవయింద్రుండు. స్వాయంభువుండు మొదలగు మనువులును నింద్రులుంబోలె నుండియున్నవారలు. జయంతుఁడను నింద్రుండును వైవస్వతుండను మనువును వర్తమానులు. ఈయింద్రు శేషించిన కాలంబు గతించుటయుఁ బద్మనాభు ననుగ్రహంబున బలి యింద్రుండుగా రాఁగలండు. అవ్వాసుదేవుం డష్టమమన్వంతరమున బలి కింద్రపదవి నొసంగుదునని ప్రతినవట్టియున్నవాఁడు. ఇట్లు ముప్పదిమూఁడు కోట్లదేవతలును యథాపూర్వంబుగం బ్రభవించుచుండురు. బ్రాహ్మణులారా! సృష్టికారకుండైన పరమేష్ఠిబ్రహ్మ కీమానంబున నెనిమిదిసంవత్సరముల యాఱుమాసముల యొకదినము నరహైనయది. ఇమ్మండలస్థ సకలభూతంబులకును గలియుగంబున సౌరసావనచాంద్రనాక్షత్రంబులను చతుర్విధమానంబులచేతను గాలంబు గడవ నయ్యెడు. అందు మూఁడువందల యఱువదియైదుదినంబులు సౌరమానసంవత్సరమును మూఁడువందల యఱువదిదినములు సావనమానసంవత్సరమును మూఁడువందల యేఁబదినాలుగుదినములు చాంద్రమానసంవత్సరమును మూఁడువందల ముప్పదియైదుదినంబులు నక్షత్రమానసంవత్సరమును నగుచుండును. వర్షశీతాతపంబులు సౌరమానంబునను వృక్షసస్యఫలనిష్పత్తియు నగ్నిష్టోమాది యజ్ఞంబులును నుత్సవంబులును వివాహంబులును సావనమానంబునను వృత్తిసంభవంబులైన వడ్డీమొదలగు వ్యవహారంబు లధిక

మాసప్రయుక్త చాంద్రమానంబునను నభిచారికంబులు నక్షత్రమానంబునను నడచుచుండు. ఈనాల్గుమానంబులకంటె భిన్నమైన మానం బుర్వీతలంబునం దుండ నేరదు. నరులును సురాసురులును నీమానంబుచే వర్తించుచున్నవారు. ఇయ్యది పురాతనంబగు శ్రుతి. భక్తియుక్తంబుగా నీ సుగప్రమాణం బెవ్వండు పఠించు వాని కెంతమాత్రము నపమృత్యుభయంబు కలుగ నేరదు. అట్లు దుర్వాసుండు ప్రతిష్ఠించిన శివలింగంబును నటు నలరారెడు. చైత్రమాసంబునం దాలింగంబు నాచరిత నృత్యగీతాద్యుత్సవపురస్సరంబుగా నెవం డారాధించు వాండు తచ్ఛివానుగ్రహంబున గంధర్వాధిపతి కాంగలండు" ౨౫౪

—♦ నింబశుచునియొద్ద దుశ్శీలుండు శిష్యుండుగాం బ్రవేశించుట ♦—

కం॥ అనియిటు సూతుండు చెప్పుటయును "దుర్వాసుండు కిమర్థముంచినవాం డా ఘనలింగ మచట? అదియెపు? డనఘా! వాకొనవ్వ" యన్న నతం డిట్లనున్.

వ॥ తొల్లి వైదిశంబను పట్టణంబున నింబశుచుండను వాండు మఠపతియై యుండి యొకలింగంబున కారాధకుండై తనకు లభించిన వస్త్రాదికంబును సస్యంబును శివభక్తులకు విక్రయించి యెక్కుడు రొక్కంబును గూడంబెట్టుచు నందించుకయు వ్యయపెట్టక యుండనుండం బెద్దకాలంబున రొక్క పెట్టియ నిండిపోయె. అంతం గ్రయవిక్రయవ్యాపారంబునకు దొరకొని యెన్నండును నెవ్వని నెంతమాత్రము విశ్వసింపక దేవపూజాసమయంబునం గూడ నతం డా మంజూష నేమఱక భద్రంబుగం గాపాడుచుండుటయు నొక కాలంబునం బరవిత్తాపహారకుండగు దుశ్శీలనామక బ్రాహ్మణుండు తటస్థపడి తత్పరిస్థితిం బోడగాంచి. ౨౫౬

కం॥ "పిసిడికి నేవల్సియుచు వెస శిష్యుండనై యిటం బ్రవేశించెద మున్. ససియగుమాటలం దన్మానసమును బెట్టెను హరింతు నమ్మించి తుదన్" ౨౫౭

వ॥ అని తలపోసి యొకనాండు మఠమధ్యగుండగు నతని సమీపించి దండాకారంబునం బుడమింబడి ప్రణమిల్లి మగిడిలేచి సవినయంబుగా నంజలింబట్టె. ౨౫౮

ఆ॥ "ఆర్య! త్వత్ప్రభావ మాలించితిని. నిన్నుంబోలు తాపసుండు పుడమి లేండు. కాన వచ్చినాండం గడుదూరముననుండి యిపుడు నీదుమ్రోల. కేమిగలదు? ౨౫౯

ఆ॥ జననమృత్యుజరలె సంసారమని దాన సారముండదంటు చక్కం దెలిసె. యౌవనంబటన్న నగు స్వప్నతుల్యమం చాత్మ కిపుడు సరిగ నర్థమయ్యె. ౨౬౦

ఆ॥ అద్రివైజనించు నాపగవలె సుతుల్ సతులు చుట్టములును క్షణికమ లరయ. కలిసమాగమములుగా వీరినందఱ నెఱుంగవలసియుండు ప్రాపదయమందు. ౨౬౧

క॥ కావున సంసారాంబుధి నేవిధమున దాఁటవలెనో యిపుడ యుపాయం
బీవు వచింపఁగవలయును దేవర! కరుణించి యావిధేయునిమీఁదన్." ౭౬౨

వ॥ అనినవిని యతండు రోమాంచితతనూరుహుండై — ౭౬౩

ఆ॥ "పడుచువాఁడవీవు. కడు సుకుమారుండ. వట్టినీకుఁబుట్టె నిట్టిబుద్ధి
వాస్తవార్థమీవు వచియించుచుంటివి. ధన్యుఁడైతి. వేమితక్కువింక? ౭౬౪

ఆ॥ పడుచుఁదనమునందుఁ గడు శాంతచిత్తుఁడై యున్నయట్టివాఁడె యుత్తముండు.
ధాతువులు క్షయించుతరుణంబునను శాంతి యెవని కుద్భవింప దెంచిచూడ?

తే॥ ఇట్లు సంసారమునసీకు నెంతయును విరక్తిగల్గినచోఁ గొల్వు రాజధరుని
జపతపంబులఁ దరియింపఁజాలవింక ఘోరభవసాగరంబు కుమార! నీవు. ౭౬౬

తే॥ బ్రాహ్మణుఁడో శూద్రుఁడో లేక పంచముండో యెవ్వఁడో యొకఁడెవఁడైననేమి దాన
పట్టి శివదీక్ష లింగంబుపైని నొక్కపువ్వు పెట్టినఁజాలుఁబో పోవు దివికి. ౭౬౭

ఆ॥ ఎవఁడు భక్తితోడ శివదీక్షపట్టినయట్టివాని కొక్కయంకుకంబో
పావుకోళ్ళో గోచిపాతయో యిడు వాని కధ్వరములతోడ నగునదేమి? ౭౬౮

వ॥ అనినవిని దుశ్శీలుం డానిందబడుచు పదంబులపైఁ దలవాల్చి యిట్లనియె — ౭౬౯

కం॥ "భవదీయసేవ నిత్యము నవహితమతి నాచరింతు. అటుగాన వెసన్
శివదీక్షాదానంబున భవదీయానుగ్రహంబు ప్రకటింపఁగదే." ౭౭౦

వ॥ అనియిట్లు పలుకుటయుం నతం డంతర్గతంబున — ౭౭౧

ఆ॥ "ఎవఁడో యొకఁడు స్వయముగ యేతెంచినాఁడిందు కరముదక్షుఁడుగను గానఁబడెడు
వేఱ యెవఁడు లేఁడు చేరువం గావున శిష్యునిగను వీని స్వీకరింతు." ౭౭౨

వ॥ అని యాలోచించి వాని చేయిపట్టుకొని — ౭౭౩

ఆ॥ ఇట్టులైనవత్స! ఈదినంబె నీకు దీక్షయిచ్చువాఁడఁ దీసికొనుము.
దూరమంద నీకుటీరంబు వేయించి యటవసింపు. రాకు మిటకు రాత్రి" ౭౭౪

వ॥ అనివాక్రుచ్చుటయుం నతండిట్లనియె — ౭౭౫

కం॥ "భవదాజ్ఞవలయుఁగానీ విబుధవరా! ఏలనాకు వేఱొకపని? ఏ
మివినోదముండు మఠమున? పవలేకా కందు రాత్రి పనియేముండున్? ౭౭౬

కం॥ గురుఁడువచించినతెఱఁగున నరుగనిశిష్యునివఖ్రతంబు లగు వ్యర్థంబుల్
మఱి మీఁదుమిక్కిలి మహానిరయంబును ననుభవించి నిర్వేదపడున్" ౭౭౭

వ॥ అనినవిని సంతోషించి నిందబడుచుండు వినయయుక్తుండగు దుశ్శీలునకు శివదీక్ష
యొసంగె. అదిమొదలుకొని యతం డతని శుశ్రూష శ్రద్ధమై నాచరించుచు
మనస్సును హరియించెఁగాని పెట్టియను హరింప నవకాశంబు చిక్కదయ్యె.

అనుదినంబును ననేకోపాయంబుల హరింప నదను వేచియున్న యా శైవుండు దేవతార్చనభోజనసమయంబులఁగూడఁ దత్స్వర్ణమంజూషం గ్రిందఁబెట్టుమని శిష్యుండు తనమనంబున — ౨౭౯

—♦ దుశ్శీలుండు నింబశుచుని పెట్టెను హరించుట ♦—

ఆ|| "మతమునందుఁ దాను మాపు శ్రీపాపిష్ఠుఁ డడుగుపెట్టనీయఁ డకట యెపుడు.
ప్రొద్దుగ్రుంకఁగానె పోయి కవాటముల్వేయు. ఇంక నేమిచేయవలయు ?

ఆ|| మంచిరాళ్ళచే నమర్పంగఁబడి కరంబెత్తుగలిగియున్న దిమ్మతంబు.
పడదు కన్ను మూచుటఁబొడిచిన. అవిలంఘ్య. మపరి వేశ్య మెట్టులైననేమి. ౨౮౦

ఆ|| కాన విషము పెట్టియైన పరుస్నచో గ్రీవ మెల్లఁ గత్తిరించియైన
పశువుఁబోలె బంధించి గొడ్డంటు పెంట్రియైన ప్రాణముల హరింతు."

వ|| అని చింతించుచుండుటయు వర్షాకాల మరుదెంచె. శ్రావణకృష్ణపక్షంబున సవిత కర్కాటకరాశిగతుండగునెడ ధనవంతుఁడగు శివభక్తుఁ డొకఁ డచటికి వచ్చి నింబశుచునకు నమస్కరించి యుచ్చైస్స్వరంబులో — ౨౮౧

ఆ|| అజ్ఞయిచ్చెదేని యస్మదీయగ్రామ మరుగుదెంచెదేని యార్య! కరుణ
నేను భక్తితోడ నీచతుర్దశిని పవిత్రకం బొనర్ప వేచియుంటి" ౨౮౩

వ|| అని ప్రార్థింప నతం డిట్లనియె — ౨౮౪

ఆ|| "ఆత్మశిష్యుతోడ నరుదెంతు నట్టి సకాలమునకు వత్స! గట్టిగాను
ఆచరింతు యుష్మదభిమతమగు క్రియ మేలకంక? ఇంటి కేగుమీవు." ౨౮౫

వ|| అనియిట్లు చెప్పి యతనిం బంపించి ప్రాభాతికకృత్యంబులుఁ దీర్చికొని యాశైవుండు పయనమై పోవుచు మధ్యమార్గంబునం దొక్క తరంగిణిని దర్శించి —

ఆ|| "శిష్య! ఈభయాలయమును జేరుంద మిచ్చట దేవపూజ గాన స్థిరుఁడవగుము
సురకు యానెడిపేరి వరనది యిది సింధుగామినియును, ఖ్యాతిగాంచినదియు"

వ|| అనిపలుకుటయు నతండు నట్లెయని యచట నిలుచుండె. నింబశుచుండును ననవరతం బాచరించు దుశ్శీలుని శుశ్రూషాదులచేతను వినయవిధేయతలచేతను రంజింపఁబడిన వాఁడై సచ్ఛిష్యునిగా భావించి బంగరుపెట్టియును దన యిష్టదైవమగు నాగేశ్వరలింగంబును బదిలపఱచియుంచిన బొంతం గ్రిందఁబెట్టి మలవిసర్జనకార్యంబునకై యించుక యవకాశంబు దీసికొని ప్రొబ్బలిచెట్లచాటునకుఁ బోయి కనఁబడకుండఁ గూర్చుండుటయు దుశ్శీలుండు దక్షిణంబ యాపెట్టెం దీసికొని సంతసించుచు సుస్థిరదిక్కునకు వెడలిపోయె. అంత నాశైవుండు లేచివచ్చి నాగేశ్వరసమన్వి

తంబగు కేవలకంథగాక దుశ్శీలుండును గానరామిఁ జంచలచిత్తుం ద్వరితంబుగా
శౌచవిధి యొక్కింతయు నిర్వర్తించుకొని యాచమనం బాచరింపకయు బొంత
యున్నచోటికి నేతెంచి సువర్ణమంజూషం గానక శిష్యుండు హరించినట్లు తెలిసి
కొని మూర్ఛవోయి పుడమిం బడి కొంతవడికి నెట్లో తెలివిఁదెచ్చుకొని లేచి ౭౮౯

క౦॥ "హా! చచ్చితిని. దురాత్ముఁడు వేఁచి హరించెను మదీయవిత్తంబెల్లన్
నాచేయుపని యిఁకేయ్యది? చూచుటయెటు వాని? యెందుఁజొచ్చుదు నిటుపై"

వ॥ అని శిలమీఁదఁ దలయును దక్షిణాంగంబులును బగులఁగొట్టుకొని తోడ్తోడ
వానిమార్గంబువట్టి కొంతవడి భ్రమించి పెద్దవాఁడగుటఁ బరిశ్రాంతుండై మరలి
మఠంబునకుఁ జనియె. దుశ్శీలుండు పేటికం దీసికొని స్థానాంతరంబునకుం బోయి
తద్ధనంబుతో వ్యాపారంబు మొదలుపెట్టి పదపడి పరిణయంబుఁ జేసికొని గృహ
స్థాశ్రమంబునఁ గొంతకాలంబుండి సంతతిం గాంచక వృద్ధత్వంబున భార్యయుం
దానును దీర్థయాత్రలుచేయుచుఁ జమత్కారపురంబునకరిగి యందలి సకలతీర్థంబు
లను స్నానంబుచేసి దేవాలయంబులం దిలకించుచు దైవభక్తిచే నృత్యగీతంబులాచ
రించు దుర్వాసుం గనుంగొని జోతవెట్టి — ౭౯౦

ఆ॥ "ఎవరునిలిపిరయ్య యీశివలింగంబు? ఏలపాడె దాడె దిచట నీవు?
ఆటపాటలెల్ల నన్యులయవి కాని తాపసులకు నిద్ది తగినపనియె" ౭౯౧

వ॥ అనియడుగుటయు నతండిట్లనియె. — ౭౯౨

## —♦ దుర్వాసస్థాపితలింగమునకు దుశ్శీలేశ్వరసంజ్ఞ వచ్చుట ♦—

తే॥ "నేన యీశివలింగంబు నిలిపినాఁడ. తన్మహేశుఁడు నృత్యగీతప్రియుండు
అట్లుగావునఁ బాడుచు నాడుచుంటి. ఇతరకైంకర్యమున కర్థ మేదఁదెత్తు?"

వ॥ అనియిట్లు సమాధానపఱచె. ఇంతలోపలఁ జిర్భటియను నొక యోగవిదుండు
చనుదెంచి — ౭౯౪

శ్లో॥ అసూర్యానామ తే లోకా అంధేన తమసావృతాః
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే చాత్మహనో జనాః. ౭౯౫

వ॥ అనుశ్లోకంబుఁ జదివి వేదాంతికంబగు నీప్రశ్న సేయుటయు దుర్వాసుండు
కూర్చుండి దానికిఁ దగినయుత్తరంబు నొసంగె. స్తుతింపఁబడిన యాసర్వంబును
దెలిసికొనుటచే విశేషించి యుదయించిన శివభక్తితో దుశ్శీలుఁ డాదుర్వాసు
నకుఁ బ్రణమిల్లి యుచ్చైర్నాదంబున. ౭౯౬

ఆ॥ "స్వామి ! జాతిచేత బ్రాహ్మణుండను నేను. కాని కర్మమునను గాను మరల
ఇంచుకయును సెవని కిచ్చియెఱుంగను. పిడిచెఁ డన్న మేని పెట్టియెఱుఁగ. ౨౯౭

ఉ॥ ద్యూతము వేశ్య లోనయిన దుర్వ్యసనంబులఁ జిక్కి యందుకై
నీతిదొరంగి దేవధరణీసురవంచన మాచరించుచుణ్
స్ఫీతధనంబుగూర్చితిని. శ్రీత్యమరాన్వయజుండనయ్యు సం
ప్రీతిని శైవశిష్యుఁడఁగ రేఁబవ బుండితి సేవఁజేయుచుణ్. ౨౯౮

తే॥ మాయమాటలచేతఁ దన్మానసము హరించుటయె కాక బిట్టు వంచించి యాతఁ
డెంతకాలంబునుండియో సంతరించియుంచుకొన్న ధనంబు హరించినాఁడ. ౨౯౯

కం॥ ఆగురుఁడును బరలోకం బేగినవాఁడిప్పు. డదియె యెంతయు నాకుణ్
వేగఁగ పశ్చాత్తాపము తాఁగలిగించెను. మనంబు తగులంబడెడుణ్. ౩౦౦

పృథ్వి॥ పురశ్చరణదానముణ్ మునివరేణ్య ! కావించి నణ్
కరంబు కరుణింపవే. కలదు విత్త మెంతేని. ఒ
క్కరైన సుతపుత్రికల్ కలుగరైరి. ఆవిత్తముణ్
స్థిరంబయిన పుణ్యపుంజయువుగూర్చి వెచ్చించెదణ్. ౩౦౧

కం॥ ఇహపరముల రెండింటను విహితం బాడగూడుపనిని వివరింపఁగదే
మహిదేవ! ఉక్తమంతయు బహుభక్తిం జేసి విగతపాపుఁడనగుదుణ్." ౩౦౨

వ॥ అని వేడికొనుటయుం దుర్వాసుం డిట్లనియె — ౩౦౩

తే॥ "ఆదిఁ బాపసహస్రంబు లాచరించి మగుడ ధర్మంబొనర్చెడి మానవుండు
కష్టమునకోర్చి యతికృచ్ఛ్రకారియైనఁ బూర్ణసంసారసాగరంబును దరించుఁ. ౩౦౪

ఆ॥ ఒక్కడిదనమె ధర్మముజ్జగించియె శైవుఁ గోరి గురుని జేసికొంటికాన
వాఁడు గురుఁడె యగును వాస్తవంబుగనీకు. ఇంచుకయును సంశయింపవలదు.

సీ॥ బ్రహ్మచర్యంబును బట్టఁగావలయును బ్రథమంబున బ్రాహ్మణుండు.
ఆవల గార్హస్థ్య మవలంబనీయంబు విబుధుఁడైనట్టి బాడబునిచేత.
అంత వానప్రస్థుఁడగుట మేలగుచేఁత శాంతికాముండైనతఁ్మకునకు.
తరువాత యతియౌట ధర్మ్యంబుఁబద్ధతి యన్నియుందెలిసిన యగ్రజునకు.
ఒగిఁ గుటీచరుఁడు బహూదకుండును హంస పరమహంస యగుట భావ్యమతని.
కిట్టిమార్గ మాశ్రయించినపదపడి పరమపదమునొందు బ్రాహ్మణుండు. ౩౦౫

ఆ॥ అందు బ్రాహ్మణుండవయ్యుఁ గుత్సితమైనయట్టి శైవమార్గ మనుసరించి.
తందువలనఁజేసి యత్యంతపాతకం బాచరించినాఁడవయ్య నీవు." ౩౦౬

వ॥ అనియిట్లు పలుకుటయు దుశ్శీలుండు వెండియు — ౩౦౭

ఆ॥ సకలవేదములను సంకీర్త్యమానుఁ డావిభుఁడు రుద్రుఁ డట్టి వేదవేద్యు
 దీక్ష దుష్టమనుచుఁ దెల్పెద వదియేల? మునివరేణ్య! శిష్యజనశరణ్య!" ౨౦౯

వ॥ అనియడుగుటయు దుర్వాసుం డిట్లనియె — ౨౧౦

ఉ॥ "సత్యము నీవుపల్కినది. శంకరుఁ జేర్కొను వేద మాతఁడే
 స్తుత్యుఁడుగాఁడు దాన మధుసూదనుఁడుం బరికీర్త్యమానుఁ డా
 దిత్యుల జ్యేష్ఠునిం గడు నుతించెడి నయ్యది. కాని బ్రాహ్మణుల్
 నిత్యముఁ బూనఁగాఁదగు ననింద్యవ్రతంబది వేఱయుండెడిన్. ౨౧౧

తే॥ పరమజాప్యము గాయత్రి బ్రాహ్మణునకు. తదుపదేష్టయె గురువును. తద్విభిన్న
 శైవవైష్ణవదీక్షలు సలుపువాఁడు కాఁడు బ్రాహ్మణుఁ డంగమట్లుముఁ జదివిన.

ఆ॥ ఇదియుఁగాక కపటహేతువునంజేసి లింగభేదమును బొసంగ నీవు.
 వ్రతమువదలి తండువలనఁ బ్రాయశ్చిత్తమించుకయును నుండ దెచట నీకు." ౨౧౩

వ॥ అనియిట్లు వచించుటయు మరల దుశ్శీలుండు — ౨౧౪

ఆ॥ "సప్తపదియటండ్రు సత్పురుషులమైత్రి. కాన నీకు నాకుఁ గలిగె మైత్రి.
 మనవిచేతు నట్టిమైత్రిఁ బురస్కరించుకొని నే రవంత శ్రోత్రమిమ్ము. ౨౧౫

ఆ॥ కలదు నాకు ధనము కావలసినయంత. దాన శుద్ధియేని యాగు నెడలను
 అది వచింపుమయ్య యంతయు నొనరింపనుంటిఁ గానఁ గరుణయుంచి నీవు."

వ॥ అని యభ్యర్థించుటయు వెండియు దుర్వాసుం డిట్లనియె — ౨౧౬

కం॥ "ఒకటే యుపాయమున్నది ప్రకటంబగు కావకీనపాపమువోవన్.
 సుకముగ విశుద్ధియగు మామకవాక్యము ననుసరించి మంచిగఁ జేయన్. ౨౧౭

తే॥ కృతయుగంబునఁ దపము యుత్కృష్టమనిరి. త్రేతలోపల ధ్యానంబ త్రిదివహేతు
 వధ్వరమునన ద్వాపరమందు సుగతి. కలియుగంబున దానంబ ఫలద మరయ.

తే॥ కలియుగంబిద్ది గావునఁ గల్మషంబు లెడలఁ గృష్ణాజినంబుల నిమ్ము పామ్ము.
 గురుధనంబును వంచించి కొంటిననుచుఁ దాపపడుచుంటి వెడఁద నెంతయును మఱియు

తే॥ అందుకొఱకయి వాని యాహ్వాయము వెట్టి యొక్క శివగుడి కట్టింపు మర్వి మీఁద
 దానివలన నుజేసియుఁ దక్షిణంబ పొందె దాన్పుణ్యమీవహో భూసుపర్వ! ౨౨౧

చం॥ మఱియొకచోటఁగూడఁ బడు మంచిగ నీదుధనంబు. శిష్టభూ
 సురుల కొసంగు మన్వహము. శుద్ధసువర్ణసమన్వితంబుగన్
 వగతిలపాత్రదానము నవశ్యముఁ జేయుము. నీదు దేహమున్
 దొలఁగి సమస్తపాపములు తోడనపోవు-విశుద్ధి గల్గెడిన్. ౨౨౨

ఆ॥ మఱియు నిచట నేను విరచించు దేవాలయంబుఁగూర్చి దూరమునకు భక్తి
చైత్రచైత్రమునను సరిఁ గల్పగ్రామమునను నుండి వచ్చి చనుదు నేను. ౨౨౩

కం॥ కావున నేఁ గట్టించెడి దేవాలయమందు నీవు దృష్టిని బెట్టం
గావలయును-స్నానాదులు గావించుచునుండవలయుఁ గర మిచ్చోటన్ " ౨౨౪

వ॥ అనియిట్లు నుడివి దేవర యిట్లు చెప్పిన నట్లు వర్తింతునని దుశ్శీలుం గాంచి మఱియు
దుర్వాసుండు — ౨౨౫

ఆ॥ " అఖిలపాపములును నడఁగుఁ గృష్ణాజినదానమున. ఒసంగు తప్ప కీవు.
గుప్తపాపములను గూలును దిలపాత్రదానమునను జేసి తప్పకుండ " ౨౨౬

వ॥ అనినవిని జింకచర్మంబులును దిలపాత్రంబులును యథావిధి సాహితాగ్నులగు
నవనీసురుల కా దుశ్శీలుఁ డన్వహము భక్తిమై నర్పించుటయుఁ బాపంబులు
తొలఁగిపోయె. అట్లు గతపాపుండగు నతనికి దుర్వాసుండు నిర్వాణదంబగు
దీక్షయిచ్చి గురుదక్షిణఁ గోరుటయు దుశ్శీలుం డిట్లనియె — ౨౨౭

కం॥ " అడుగుము గురుదక్షిణ మునినాయక! ఇచ్చెదను శక్తియుండినచో ని
ప్పుడ విత్తశాఠ్యమును నీయెడలను గావింప. ఇంక నేదునవలయున్! " ౨౨౮

వ॥ అనియిట్లు వేడుకొనుటయు దుర్వాసుం డిట్లనియె — ౨౨౯

శా॥ " కల్పగ్రామముగూర్చి పోదునిఁక నే. కల్యాణితం బీయుగం.
బల్పాకాంతము. కావునం గృతయుగం బాసన్నమౌ దాఁక నా
కా కట్టించబడదిందు పొందియును. ఈకట్టించు దేవాలయం
బల్పాయంబయియుండియున్న. దవశిష్టార్ధంబు గట్టింపనౌ. ౨౩౦

కం॥ ఇది నాకగు గురుదక్షిణ. తదాలయముముందఱను యథాశక్తిని నీ
వు దినదినము బలికుసుములు పొందలుగ నిడి నృత్తగీతములు సేయనగున్ " ౨౩౧

వ॥ అనియిట్లు వాక్రుచ్చి యమ్మునీశ్వరుండు కల్పగ్రామంబునకు వెడలిపోవుటయు
దుశ్శీలుండు తదుదీరితం బంతయు నాచరించె. భక్తిపూర్వకంబుగా నిట్లు తత్కా-
ర్యంబులు నిర్వర్తించుటయుఁ దదాలయంబు దుశ్శీలసంజ్ఞితంబై తనరవచ్చె. అది
కాలంబుదీసికొని ప్రతివత్సరముఁ జైత్రమాసమునం దాదేవుని దర్శించు జనము
వత్సరకృతంబగు పాపంబునుండి వదలంబడు. స్నపనాది సకలార్చనంబును
నాచరించిన ముప్పదిసంవత్సరములపాతకం బప్పుడ నశియించును. తదగ్రంబున
నృత్యగీతాదికంబులు గావించువాని యాజన్మమరణాఘంబు లన్నియు నంతంబు
నొందు, ముక్తి ఘటిల్లు. దుశ్శీలుం డట్లనర్చి భక్తిమై గురుపాదపద్మంబుల

## నింబేశ్వర శాకంభరుల యుత్పత్తి

స్మరించుచు దక్షిణదిశ నతనిపేర నింబేశ్వరమను నొక్క శివాలయంబు గట్టించె. అట్లు శాకంభరియనంబడు తద్భార్యయుఁ దనపేరితో దుర్గం బ్రతిష్ఠించె. అంత నాదంపతు లిరువురును నింబేశ్వర శాకంభరీదేవతల నిత్య నైవేద్యదీపారాధనాదులకుంగా బ్రాహ్మణులకుఁ గొంతవిత్త మర్పించి తక్కటిధనం బంతయు ధర్మార్థంబు వినియోగించి చంకలకు జోలెలం దగిలించిరి. కొంతకాలంబునకు దుశ్శీలుండు దేహంబు విడుచుటయు శాకంభరి తద్దేహంబును హవ్యవాహంబునం జేర్చి సహగమనంబు గావించె. పదపడి యుభయులు నప్సరస్సంసేవ్యమానంబగు నాకాశయానం బధిష్ఠించి యత్యంతసంతోషంబుతో నమరాలయంబున కరిగిరి. ఉత్తమంబగు నీ దుశ్శీలోపాఖ్యానంబు పాఠకుల కజ్ఞానకృతంబులగు నఖిలపాపంబులను హరించు. బ్రాహ్మణశ్రేష్ఠులారా! అట్లిందు మునిహితకాంక్షులై యేకాదశ రుద్రులు వసింతురు — ౮౩౨

## ఏకాదశరుద్రుల యుద్భవము

సీ॥ తద్దర్శనంబునఁ బెద్దపెద్దయఘంబు లంతంబునొందు క్షత్త్రియవరులార!
తన్ననుస్మృతిచేత మున్నున్నదోషముల్ విలయంబునొందు నో విప్రులార!
తత్పూజనంబున హృత్పద్మ మెంతయుం గలుషవిహీనమౌ నలఘులార!
తన్నుతిక్రియనుండి ధన్యాత్ములయ్యెద రెట్టిచెట్టలును మునీంద్రులార!"
అనివచింప శౌనకాదు "లొక్కఁడె రుద్రుఁ డాలకింపఁబడెడి నాగమముల,
మఱి ద్వితీయరుద్రు మాటయు విన మహితోన్నత! అధికఖ్యాత! సుజననేత! ౮౩౩

ఆ॥ గౌరి భార్యగాఁగ స్కందుండు కొడుకుగా నుండియున్న రుద్రుఁ డొకఁడె మాకు
విదితుఁ డంతకన్న వేఱైనరుద్రు లెవ్వారొ చెప్పు" మనుడు వారి కతఁడు ౮౩౪

వ॥ మహాభాగులారా! మీరనునది వాస్తవంబ. ఒక్కండే రుద్రుండు. రెండవ రుద్రుఁ డేవిధంబునను లేఁడు. కాని యేకాదశరుద్రు లెట్లయిరో వాక్రుచ్చెద వినుండు తొల్లి కంపితవ్రతులై వారాణసియందుండు పదునొకండుగురు మునులు హాటకేశ్వరదర్శనార్థం బుత్సాహంబుతోఁ బయనమై యొకరికన్న నొకరు ముందు చనవలెనను స్పర్థచేఁ బాతాళస్థ హాటకేశ్వరంబునకుఁ బోయి యందఱికంటె ముం దందలి శివుని దర్శింపనివాఁడు తక్కునందఱిపాతకంబును నొక్కండ యనుభవింపవలెనని సమయంబుచేసికొని యగ్గలంబు పరువులెత్తుటయు హాటకేశ్వర దేవుం డయ్యది గుర్తెఱింగి వారి భక్తికి మెచ్చుకొని తత్క్షణంబ పాతాళంబునుండి సూక్ష్మంబగు నాబిలమార్గంబునఁ బుడమికి వచ్చె. ౮౩౫

సీ॥ పెంచల మూడింటిచే ముచ్చటగానుండు వాలును లీలఁ గెంగేలఁ దాల్చి
స్వాభావికంబైన చతుర్యుగముగాక దంబైన ఫాలనేత్రంబు గలిగి
గంగాన్వితంబైన ఘనజటాజూటంబు లలి ఖండశశిచే నలంకరించి
అడుగులదాఁక వ్రేలాడ నీలగ్రీవఁ దలకాయపుష్టిల దండ వైచి
ఎంతో యందముగను నేకాదశప్రకారంబులై మునీశ్వరప్రకాండు
లందఱికి నొసంగె సాత్త్వికదర్శనం బేకకాలమం దిఁ కేమిగలదు ! ౨౩౬

వ॥ అంత నమ్మును లందఱును దమముందఱ సాక్షాత్కరించియున్న వృషభధ్వజు
విలోకించి భూశాఖ్యమీఁద నిల్వఁబడి — ౨౩౭

కం॥ "నతి సర్వదేవమయునకు. నతి శ్రీదేవాధిదేవునకు శాంతునకున్
నతి నూత్నకళేబరునకు, నతి యంధకమర్దనునకు. నతి రుద్రునకున్. ౨౩౮

కం॥ జోత పృథగ్విధవాయువ్రాతముచే సర్వజగము బ్రదికించుచు సం
ప్రీతి సదా దివమందున స్థాతలయి చెలంగునట్టి తద్రుద్రులకున్. ౨౩౯

కం॥ దండము పశ్చిమదిక్కున నుండి పిశాచములబారినుండి జగంబుల్
నిండుకృపం బాలించెడి రుండసృగ్ధారులైన రుద్రులకెల్లన్. ౨౪౦

కం॥ కేలుమోడ్పు భూతజాలంబునుండి లోకములనెల్ల నిండుకరుణతోడ
మనుచు చూర్ధ్వమంద యనయంబు వర్తించు రుద్రులకును గలితభద్రులకును.

కం॥ జోహారు భూతలంబున మోహితమతులైన ప్రజలఁ బ్రోచుచు నెపుడున్
స్నేహమున నుండు ప్రకటితమాహాత్మ్యుల కలుగు కాంతిమద్రుద్రులకున్ " ౨౪౧

వ॥ అనిస్తుతించుచుండు భక్తినమ్రులైన యాతాపసులం గని యేకాదశరుద్రు లిట్లనిరి—

తే॥ "పదునొకండువిధంబులం బరఁగు నేను దాపసోత్తములార ! ఎంతయును యుష్మ
దీయభక్తికి మెచ్చితి. మీ యభీష్టవరము కోరుఁ డొసంగెదఁ గరుణతోడ." ౨౪౨

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు నమ్మునీంద్రులం — ౨౪౩

తే॥ "తుష్టిఁ జెందితివేని మాయిష్టవరము నిచ్చుటకు సిద్ధమంటివే నీశ ! యిచట
పదునొకండువిధంబులం బరఁగుచును వసింపు మెల్లప్పుడేమి యాచింపవలయు !

ఆ॥ అఖిలతీర్థమయము హాటకేశ్వర మెన్న. అట్టి క్షేత్రమధ్యమందు మీరు
సర్వదా వసించి శాంభ ! నీయారాధనం బొనర్చెదము ఘనంబుగాను " ౨౪౪

వ॥ అనియిట్లు వేడుకొనుటయు భగవానుండిట్లనియె — ౨౪౫

ఆ॥ "ఏధరించినట్టి యేకాదశాకారములను నెపుడు నిచట లలి వసింతు.
వెంట్రుమొదటి సాదుమూర్తి కైలాసభూధ్రమున నుండు సర్వదా సుశోభ. ౨౪౬

ఆ॥ యుష్మదీయమైన యురునామములతోడ నిమదీయమూర్తు లిచట నుండు
పరమపదముగలుగు భక్తి విశ్వాసమిత్రప్రదమునందుఁ గ్రింక యవి భజింప.

కం॥ వేదోల విప్రులారా ! ఆయేకాదశసువిగ్రహములకు భక్తిన్
జేయఁబడుపూజ యగుఁ బో నే యేకాదశగుణంబు విఖ్యాతముగన్. ౨౪౭

వ॥ అనియిట్లు పలికి ముక్కంటి యక్కడనే యంతర్ధానంబునుబొందె. సమ్మును లును నచ్చోటనే యాశ్రమంబు లేర్పఱచుకొని యత్యంతశ్రద్ధ నయ్యేకాదశ మూర్తుల నారాధించి యపవర్గంబుగాంచిరి. ఇతరుండైనను శ్రద్ధమై నయ్యేకాదశ మూర్తుల భజించిన మహేశ్వరుండు పరమస్థానంబు ప్రాప్తింపఁజేసెడి. ఏకాదశరుద్రు లదిమొదలుకొని యేర్పడిరి. చైత్రశుద్ధచతుర్దశీతిథిం దద్రుద్రులను భక్తిశ్రద్ధా సమన్వితంబుగా భజియించువాఁడు పరమపదంబు పడయఁగలిగెడి" ౧౨౨

—♦ ఏకాదశరుద్రులదగ్గఱఁ జేయవలసిన దానములు ♦—

ఆ॥ అనివచించుటయును "నార్య! వారాణసినుండివచ్చియున్న యోగివరుల యాఖ్యలెవ్వోచెప్పు" మనివేడుటయును నాబుధులఁగాంచి సూతుఁ డిట్టులనియె.

వ॥ "వారు పదునొకండుగురును మృగవ్యాధ సర్వసంజ్ఞ నిందిత మహాయశో హైకపా దహిర్బుధ్న్య పినాకి పరంతప దహ నేశ్వర కపాలిసంజ్ఞలం జెలువారుదురు. రుద్రులును నవియె పేళ్ళం బ్రసిద్ధికివచ్చిరి" ౧౨౪

చ॥ అనియిటుపల్క శౌనకముఖావనిదేవులు రోమహర్షణిఁ

గనుగొని "పూర్వ మీవు జపకర్మ మెటుల్వొనరింపనౌనో చ

క్కనుడివి. తత్తు రుద్రులకుఁగా నెది యీవలెనో వచింపు" మం

చనుటయు నమ్మునీంద్రులకు హర్షముతోడుత నాతఁ డిట్లనుఁ. ౧౨౫

వ॥ "వారి నుద్దేశించి యొక్కొక్కరికి వేలువేలుగా గోదానంబులు చేయవలయును. మృగవ్యాధునకు గుడధేనువును గపాలికి నవనీతధేనువును నహైకపాదున కాజ్య ధేనువును నహిర్బుధ్న్యునకు సువర్ణధేనువును బినాకికి లవణధేనువును బరంతపు నకు గసధేనువును దహనున కన్నధేనువును నీశ్వరునకు జలధేనువును నీయవల యును. ఈధేనువుల నీమహాత్ముల కిచ్చువాఁడు నిశ్చయంబుగాఁ జక్రవర్తి యగునని పితామహుండు వచియించె. ఇతరత్ర యీఁబడు ధేనువులే యిట్టి ఫలంబు నొసంగ నీశ్వర సాన్నిధ్యంబునఁ జేయఁబడువానిసంగతి యేమి చెప్ప వలయును? కావున విశ్వప్రయత్నములు చేసియైనను నీగోవుల నొసంగునది. శక్తివిహీనుఁడు రుద్రు లందఱికిని భక్త్యయజ్ఞోక్త ప్రకారము ప్రయత్నించి యైనను నొక్కగోదానము కావించునది. బ్రాహ్మణులారా! హాటకేశ్వర క్షేత్రంబున యాజ్ఞవల్క్యప్రతిష్ఠితులైన ద్వాదశాదిత్యులకు భక్తిమైఁ బ్రతి సప్తమిం బూజించువారు నిస్సంశయంబుగా వాంఛితంబులం బడయం గలుగు దురు." ౧౨౬

## యాజ్ఞవల్క్యవృత్తాంతము

క౦॥ అనియిటు వచియించుటయును వినినా "రాదిత్యుఁడొకఁడె వియదధ్వమునఁ గాఁ
కనఁబడుచుండెడి నెప్పుడమ్మని పండ్రెండుగుర నెట్లు మును స్థాపించెన్ ? ౧౫౭
క౦॥ ఉద్దేశము లేకుండనె యొద్దియుఁ జేయఁగఁబడమి నెంచుల్గక ప
న్నిద్దఱ స్థాపించినవాఁ? డద్దిగ! ఆ కాల మెద్ది" అని యడుగుటయున్ ౧౫౮
వ॥ "తొల్లి శునశ్శేపుండను మునిసత్తమునకుఁ గృతియను సుతుఁ డుదయించె. అతనిపుత్రుండు శునఃపుత్రుండు. అతనికిఁ బాణాఖ్యుండను పుత్రుఁడు. పెద్దకాలంబునకు లోకపితామహుండగు బ్రహ్మ సావిత్రీశాపవశంబున నా నాగరాఖ్యునకు జనియించె. చతుర్ముఖుండు యజ్ఞంబు సేయ సమకట్టి పెండ్లమగు సావిత్రి వేళకు రామికిం గినిసి ౧౫౯
క౦॥ "కాలాప్రవేశసముచిత కాలాత్యయ మించుకేని కాదుండఁగనే
మేలైన యనుద్వాహితబాలికఁ గొనితెమ్ము కష్టఁ బనివిని మఘవా!" ౧౬౦
వ॥ అని యిందురిన కాజ్ఞయిచ్చుటయు నతండు సర్వలక్షణలక్షితయగు నొక గోప కన్యకను గోవక్త్రంబునుండి గుహ్యమార్గంబునం దీసి పవిత్రఁ గావించె. ౧౬౧
ఆ॥ "గోవులయును భూమిదేవులయును గులం బొకటె ద్వివిధ గాఁగ నుండె జగతి.
మంత్రిసమితి యొకట మఱియొక్కచో హవిర్ద్వితతి యుండి నిట్లు వెలయుచుండె"
వ॥ కావున నాయమను బ్రాహ్మణిం గావించి పదంపడి పితామహుండు గృహ్యోక్త విధానంబునం బరిగ్రహించె. అవిడ పత్నీకాలం బ్రవేశించి రకనాసమలంకృతయై వర్తించుచుండుటయు దేవతాస్త్రీసమేతయై యరుదెంచిన సావిత్రి విలోకించి ౧౬౩
శా॥ "తాతా! తప్పొకయింతలేని నను సంత్యాగంబు కావించినా.
వేతద్ధేతువునుండి తాతగనె నిన్నెంతు సంగంబునం.
దీతీ ర్పెండ్లము మీఁది పెండ్లమునకై యెల్లప్పుడున్ మర్త్యులే
ప్రీతిం జేతురు కానఁ బుట్టెదవని ధాత్రిన్ నీవు మర్త్యుండవై. ౧౬౪
ఆ॥ మనుజుఁడుగ జనించి మఱిమఱి కామార్తి యనుభవించుచుండు మనుటనీవు.
న్యాయయుక్తమైన నామాట తప్పక జరిగితీరు లేదు సంశయంబు" ౧౬౫
వ॥ అని శపియించి యజ్ఞమండపంబునుండి పోయి పర్వతశిఖరం బధిరోహించి తపంబు గావించె. బ్రహ్మ యివ్విధంబున భూమియం దవతరించినవాఁడు. అట్లవతరించి యాజ్ఞవల్క్యుండను పేరం బరంగుచు యౌవనవంతుఁడగుటయుఁ గామమునెరి

కించి యతని చిట్టు బాధింపఁగడంగె. తాను రూపవంతుఁడగుటఁ దద్గర్వాతి
రేకంబునఁ గనఁబడిన సుందరి నెల్లం గలయుచు స్త్రీవ్యసనంబునం జిక్కియుండుట
యుఁ దండ్రియగు చాగాయణుం డతని స్వాశ్రమంబునుండి వెళ్ళఁగొట్టె. అట్లు
జనకునిచే విసర్జింపఁబడి యందందు భ్రమించుచుం బోయిపోయి చమత్కార
పురంబున వేదంబులు వెళ్ళఁజదివి శిష్యసహస్రంబులకుఁ బ్రచారంబు సేయుచున్న
శాకల్యనామక బ్రాహ్మణశాస్త్రుల దగ్గఱి పేరెలుంగున నమస్కారంబు నివేదించి
శిష్యుఁడై చిరంబు వేదాధ్యయనమొనర్చుచుండుటయు నానర్తదేశాధిపతి జల
శాయియగు చక్రపాణి సాన్నిధ్యంబునఁ జాతుర్మాస్యవ్రతంబుఁ జరించుచు

ఆ॥ "ఈపురంబునందు నేనుండుపర్యంత మనుదినంబు నస్మదాలయమున
కేగుదెంచి కరుణ నీవు శాంతికపౌష్టికము లొనర్చుచుండు క్ష్మానిలింప!"

వ॥ అని శాకల్యుఁ బ్రార్థింప నతండు వల్లెయని దినమున కొక్కనిచొప్పున శిష్యులఁ దన్మందిరమున కనుపుచు వచ్చె. వారు చని శాంతికంబు నిర్వర్తించి రాజు నాశీర్వదించి యతనివలన దక్షిణవడసి యది తెచ్చి గురునకిచ్చి తిరిగి స్వగృహంబులకుం జనుచుండెడివారు. నిత్యము నిది వ్యవహారము. అవ్వరుస నొకనాఁడు యాజ్ఞవల్క్యునంతు వచ్చినది. అమ్మహీశునకు మంథరయను నొక్క విలాసిని. అది యుజ్జ్వలము రూపవతి. ఆకామినిని గామార్తుఁడగు యాజ్ఞవల్క్యుండు కామించి రాత్రిం గలిసికొనుచుండెడివాఁడు. అది వాత్స్యాయనోక్తప్రకారంబుగా నాలింగనపూర్వకంబులగు ననేకభావంబులఁ గనఁబఱచుచు మయూరపదకాదులచేతను మణిప్రవాళకంబులచేతను శరీరాధరంబుల నఖదంతక్షతంబు లొనరించుచును నతని సుఖపెట్టెడిది. రాత్రియెల్ల నట్లు రమించి ప్రాతఃకాలంబున నధ్యయనార్థం బరుదెంచిన యయాజ్ఞవల్క్య శాంతికంబు నిర్వర్తించి వచ్చుటకుఁగా క్ష్మాపాలసదనంబునకు శాకల్యుండు పంపుటయు నతండు పోయి యథోక్తవిధి నంతయు నాచరించి యవసానంబునఁ బంచరుద్రంబులచే మంత్రించి పాత్రంబును సపుష్పంబును నగు కలశోదకంబుం గైకొని ప్రీతుఁడగు నానర్తపాలకుని పంచస్థానసహితంబగు వ్యామాలేఖ్యయను మంత్రంబు విధిపూర్వకంబుగా నుచ్చరించి శిరంబునం జల్లఁబోవుటయు నతం డతని శరీరమందలి నఖదంతక్షతంబుల విలోకించి దురభిప్రాయపూరితుండై మలినాంబరధారియగు నతని విటప్రాయునిగా భావించి పక్కన నవ్వి ౧౬౨౭

కం॥ "గుట్టులవాపడింగల కట్టుపడియుంబోతువు, పోయి కాదన కీవి
ఎట్టునికి బ్రాహ్మణ! మట్టివలెను వృద్ధిఁ జెందు మతి యది సరవిన్" ౧౬౨౮

వ॥ అనిపలుకుచుండ యాజ్ఞవల్క్యుఁ డత్యాగ్రహంబుమై నట్ల యాచరించి యగ్రహీతదక్షిణుండై యాత్మావాసంబునకరిగె. అంత నాయక్షతలలోని స్తంభంబు పలువిధంబులగు పల్లవంబులతోడను గొమ్మలతోడను నలంకృతంబయ్యె. అది యవలోకించి యానర్తాధిపతి యాశ్చర్యపడి యగ్గలంబు పశ్చాత్తాపంబున— ౨౭౦

"శా॥ ఛీ! నేఁజేసినకార్య మారయఁ గడుం జింత్యంబగుంగాదె? ఆ
న్యూనం బీతని మంత్రిసత్త్వ. ఎవరో యిక్కాదిలేయుం డిటుల్
తా నుర్వీసురవేషధారియగుచున్ ధాత్రిన్ దిగంబోలు. అ
య్యో! నేనీతనిమంత్రివారిఁ గొనుచో నున్నె జరామృత్యువుల్?" ౨౭౧

వ॥ అనిచింతించుచు నత్యాశ్చర్యంబుతో నాదినం బాపార్థివుఁ డబ్దకతోపమానమ్ముగా వెళ్ళించె. ఎట్లెట్లో పవలు గడపినను రాత్రిగడపుట మతిచింతకష్టంబయ్యె. అంతఁ బ్రొద్దుపొడుపునలేచి యమ్మహీపతి యాప్తులైన పురుషుల ద్వారంబున శాకల్యుఁ బిలువంబంచి సాదరంబుగా నంజలిచేసి వినయంబు గనంబఱచుచు ౨౭౨

క॥ "నిన్నటిశాంతిక్రియజరుప నీ వ్వాని నిటుకుఁ బంపితో నేఁడున్
క్రొన్నన నతనినె పంపుము. ఉన్నదిపని. కరము భక్తియొదవ నతనినిప్డే" ౨౭౩

వ॥ అనివిన్నవించుటయు నతండు నట్లయని తనయింటికింబోయి యాజ్ఞవల్క్యుం బిలిచి మృదుమధురవచనంబుల నిట్లనియె. ౨౭౪

తే॥ "ఈదినంబునఁగూడ మహీశునింటి శాంతికంబును గావింపఁ జనుము పుత్ర!
ఉన్నవారందఱుండఁగా నిన్నె యతఁడు పంపుమనె. ఇతి యభిమానభాజనమవు"

వ॥ అనినవిని యాజ్ఞవల్క్యుండు ౨౭౫

ఆ॥ "శాంతికంబుజరుపఁ జనఁ దగ్రహంబున. నాదరింపఁడయ్యె నతఁడు నన్ను.
మామకీనమైనమంత్రంబువుల్గొన నొక్క కొయ్యమీఁద నుంచుకొనియె. ౨౭౬

క॥ కావున నానర్తేశునిభావము రంజింపఁజేయఁ బ్రజ్ఞగలండౌ
తావకశిష్యు లొక్కని ద్యావిబుధవరేణ్య! సరవి ననుపఁగదయ్యా" ౨౭౭

వ॥ అనవుడు శాకల్యుండిట్లనియె. ౨౭౮

క॥ "యోగక్షేమము లరయుచు బాగుపఱచు ప్రభువునాజ్ఞ ప్రబలఁగఁగుఁ గార్యం.
దేగుణహీనుం డాతని కేఁ గంటకుఁ డౌతెఁ డెట్లు నందెడు సుఖముల్." ౨౭౯

క॥ కులమున నధికుఁడననియో యలఘుకలాఢ్యుండననియొ యతిగర్వముతో
ఇల రాజు నుపాసింపని ఖలునకుఁ బ్రాచితము భిక్షుకత మనుదాఁకన్" ౨౮౦

వ॥ అనియిట్లు గురుశిష్యు లిరువురును వివాదపడుచుండ మహీశు పనుపున మంతి కొండఱు వచ్చి త్వరపడుచు శాకల్యునకుఁ జేతులుజోడించి "అయ్యా! రాజ

దారులుచూచుచున్నాఁడుగాన శిష్యుని ద్వరితంబుగఁ బనుపుఁడని విన్నవించిరి. ఎన్నిపరులం చెప్పినను యాజ్ఞవల్క్యుండు శాంతికంబుగావించుటకుఁ జనమిని విధేయుఁడై దోసిలొగ్గి నిలువంబడియున్న యుద్దాలకు నొద్దకుఁజీరి శాకల్యుండు

ఆ॥ "చనుమువత్స! వేగ శాంతికంబునొనర్ప నృపతిమందిరమున కిపుడునీవు.
అస్మదీయమైన యానతి స్వాధ్యాయపఠనముంబొనర్ప బాగుగాను" ౨౨౩

వ॥ అనియాదేశించుటయు నతండు వల్లెయని రాజమందిరంబునకుం బోయి శాస్త్రోక్త ప్రకారంబుగా శాంతికంబు నిర్వర్తించి సాక్షతంబును సపుష్పంబును నగు కలశోదకంబుం గైకొని భూపాలు డగ్గఱి నతండు ౨౨౪

క॥ "నీమంత్రమహిమఁజూతము భూమిసురా! అగ్రమందుఁ బొలుపారెడియు
ద్దామస్తంభము మీఁదను క్షేమముపొంటెక జలంబు చిమ్ముంగదవే" ౨౨౫

వ॥ అని యానతిచ్చుటయు నతండు మంత్రం బుచ్చరించి కాష్ఠంబున కభిషేకించి వెళ్ళిపోయె. యథాపూర్వంబుగ నేయున్న యాకంబంబు నానర్తమహీశుం డవలోకించి సవిషాదంబుగం బశ్చాత్తాపపడుచుఁ దిరిగియు యాజ్ఞవల్క్య నిమిత్తము శాకల్యునింటికి నేర్పరియగు మఱియొకదూతం బంపుచు. ౨౨౬

తే॥ "జాడ్యమునఁ బీడ్యమానుండ. శాంతిఁజేయ మొన్నఁబంపిన నీశిష్యుఁ గ్రిన్నఁబంపు
మతని కవమతిఁజేసితి నకట! నేను. తత్కృతాశీస్సు గొననైతి. దానఁజేసి

కం॥ హెచ్చెను జాడ్యం. బాతఁడు వచ్చిన స్వాస్థ్యంబుగలుగు వసుధాదేవా!
చెచ్చెర నాద్విజబాలు నె పుచ్చుము నాభవనమునకు బోధించి యెటో" ౨౨౭

వ॥ అనిచెప్పుటయు నరుగు మరుగుమని యనేకవారంబులు శాకల్యుండు శాసించియు యాజ్ఞవల్క్యుం డేగమిని మధుకుండను మఱియొక శిష్యుం బంపించె. అతండును నుద్దాలకువిధంబున నుర్వీశున కాశీర్వాదమిచ్చి యా స్తంభంబున కభిషేకక్రియ నెఱవేర్చెఁగాని యయ్యది యథాపూర్వంబుగనే యగపడియె. మహీపతి మగుడ నొకమానిసిని యాజ్ఞవల్క్యకొఱ కనుపుటయు నతం డనేకథా గురునిచేఁ బ్రబోధింపఁబడియు నరుగండు. అంత శాకల్యుండు గుణవంతుండును భాగవిత్తియు నగు ప్రచూడుండను మఱియొకశిష్యుం బంపుటయు నతండును బోయి మున్నుచన్న యిరువురుంబోలె శాంతికంబు నిర్వర్తించి తజ్జలంబు స్తంభంబుపై సమంత్రకంబుగాఁ జల్లెనుగాని యది యెప్పటియట్ల నిలిచియుండె. పదంపడి పశ్చాత్తాపయుతుండగు ప్రభుండు స్వయంబుగనె బయలువెడలి యాజ్ఞవల్క్యునిచే మంత్రింపించుకొనుటకు శాకల్యసదనంబుం బ్రవేశించి యతనికి నతియొనర్చి ౨౨౮

క౦॥ "నాయింటిశాంతికంబున కోయార్యా! మున్నవచ్చియుండిన శిష్యుల్
వే యనుపుమయ్య మాకుఁ శ్రేయం బారోగ్యయుతము శాంతుతోడన్"

వ॥ అనిప్రార్థించుటయు శాకల్యుండు రాజు వినుచుండ యాజ్ఞవల్క్యుం గనుంగొని

ఆ॥ "యాజ్ఞవల్క్య! పుత్రి! అనర్హునింటికి శీఘ్రమేగు. మేను చెప్పినాఁడ.
శాంతికంబొనర్ప చని యాన్నృపాలుండు శాంతిఁ గోరుఁడగుచు సౌఖ్యమందు."

వ॥ అని యాదేశించుటయు నతం డిట్లనియె. ౯౩

క॥ "నే నచ్చటికేఁగ గురూ! కాన ననుంగూర్చి చెప్పఁగఁదగదుర యీ
మానవనాథుఁడు నన్నవమానించినవాఁడు రాజ్యమత్తుండగుచున్" ౯౪

వ॥ అనినవిని యతండు కోపగించుకొని భర్త్సించుచు యాజ్ఞవల్క్యునితో నిట్లనియె.

ఆ॥ "ఒక్కయక్కరంబె యొసఁగనీ. అవ్వాని యప్పవీఁగ చెంతఁ బూర్ణమిడిన.
నా కడం బఱించి నామాటవినవైతి గాన శాపమీయఁగలను నీకు" ౯౫

వ॥ అని యిట్లు వక్కాణించుటయు యాజ్ఞవల్క్యుండు ౯౬

ఆ॥ "న్యాయపథమువీడి నను శపియించుచో నిను శపించువాఁడ నేనుగూడ
గర్వభరమునూని కార్య మకార్యంబు తెలియఁగనట్టిగురుఁ ద్యజింపవలయు ౯౭

క॥ కొలమాలిన పనులన్నియుఁ బుగపుగ కావింపుమనుచుఁ బోగాడుటచే
గురుఁడవుగావిఁక నాకీ. వరిగద నినువిడిచి యెపట్టికైనను నిపుడే ౯౮

ఆ॥ ఉన్న శిష్యులందఱొక్కొక్కరొకదినం బొజ్జ యాజ్ఞలోన నుండవలయు.
ఈవు చెప్పవనిని నావంతువాఁడు నేఁ జేతు. లేనిచోఁ ద్యజించి పోదు" ౧౦౦

వ॥ అనిధిక్కరించుటయు శాకల్యుం డిట్లనియె. ౧౦౧

చం॥ "మతిరొకచోటికేగుటయు మానసమందుఁ దలంచదేని నుం
దట మదుదీరితంబులగు నాలుగువేదము లంగము ల్పహం
త్వరితము నావి నాకొసఁగి తర్లు మనంతర మేడ కేని నున్.
గురునకుఁ బంగనామమిడుకూళవు నీ విఁక నేటికిచ్చటన్? ౧౦౨

ఆ॥ త్రావుమిపుడనీవు తస్కరికాముండ మంత్రితాంబువులను మాన కిప్డు.
కన్నఁదన్మహాస్త్రఁ గ్రక్కుదు కడుపులోనున్న నాదువిద్య లన్నిగూడ"

వ॥ అనియిట్లు వాక్రుచ్చి యతం డాథర్వణమంత్రంబులచే జలం బభిమంత్రించి యాజ్ఞవల్క్యునకుఁ గ్రక్కఁబోయుటయు నతం డమ్ముద్దకంబు ద్రావి యన్నంబుతోఁగూడ విద్యల నన్నింటిని వెళ్ళఁగ్రక్కి మాయోభవించిన చిత్తంబుతో విశ్వామిత్రప్రాంతంబున కరిగి యట స్నాతుండై శుచియై యనంతభక్తి నాదిత్య విగ్రహంబులం బండ్రెండింటిఁ బ్రతిష్ఠించి పరిభ్రాజించె. ౧౦౪

## —♦ ద్వాదశాదిత్యుల యుత్పత్తి ♦—

సీ. ధాతయన్ పేరునఁ దనరెడిఁ బ్రథముండు. మిత్రుఁ డర్యముఁ డటుమీఁదివారు.
శక్రాహ్వయుండు దా సరిగ నాలవవాఁడు. వరుణాంశులు తరువాతివారు.
భగసంజ్ఞితుండు సప్తముఁడు. వివస్వంతుఁ డష్టముం. డవతలియతఁడు పూష.
దశముండు సవితయా. త్వష్ట యాకలివాఁడు. విష్ణునామకుఁ డటు వెనుకవాఁడు.
ఇట్లు పండ్రెండువిధముల యినుల నిలిపి గంధపుష్పాదికంబులం గరముభక్తి
ఓలిభజియించుటయుఁ బెద్దకాలమునకుఁ గట్టెదుటనిల్చి యారవి యిట్టులనియె.

ఆ॥ "యాజ్ఞవల్క్య! యుష్మద్దర్శనమునఁ జేసి యగ్గలంపుఁ బ్రీతియయ్యె నాకు.
ఎదియొ భవదభీష్ట మిచ్చెదఁ జెప్పికో మిమ్మంచుకేని సంశయింపకుండ" ౨౦౬

వ॥ అనియిట్లుపలుకుటయు యాజ్ఞవల్క్యుండు ౨౦౭

క౦॥ "గ్రహనాథ! నాపయి ననుగ్రహ ముద్భవమైనయెడలఁ గాదన కిపుడే
గహనాధ్యయనము సేయింపు హితాధ్యాపకుఁడవగుచుఁ బుత్రిన కటులన్"

వ॥ అని కోరుకొనుటయు నాదిత్యుండిట్లనియె. ౨౦౯

ఆ॥ "చక్రవాళశిఖరిసందర్శనార్థమే ననుదినంబు మేరువును బ్రదక్షి
ణింపవలయుఁగాన నీచేతఁ జేయించుటెట్లు వేదపాఠ మేను విప్ర! ౨౧౦

ఉ॥ కావున నాదుతేజమున గ్రుస్సున భస్మముగాకయుండున
ట్లీవు మదశ్వకర్ణమున నెంతయు సూక్ష్మపుటాకృతిన్ మహీ
దేవ! వసించుచుం జదువు తిన్నగ వేదము శాస్త్రమాదిగా.
ఏవఁధియించుమాట విని యీక్రియమాణము కట్టిపెట్టఁకన్" ౨౧౧

వ॥ అనియిట్లు సెలవిచ్చుటయు యాజ్ఞవల్క్యుండు వల్లెయని యశ్వకర్ణంబునం బ్రవే
శించి సాంగోపాంగంబుగను సపరిశిష్టంబుగను జతుర్వేదంబులం దన్ముఖంబునఁ
జదువుకొని సమాప్తంబుగా గురుదక్షిణఁగోరుమన నాదిత్యుండు ౨౧౨

సీ॥ మొదటిదౌ బుగ్వేదమున నున్నయటువంటి సూర్యసంబంధి సత్సూక్తములను
రెండవదౌ యజుర్వేదంబులోపల న్గ్రాలుచుండెడి పావనంబులను
మూడవదగు బుధు లాడుచుండినయట్టి చారుతరంబైన సామములను
నాలవామ్నాయంబునం దేజరిల్లుచు నురుతరంబైన కల్పోక్తములను

సలిపివ్యాఖ్యానములను ప్రచారమునకుఁ జేవలయునీవు భూమిలో ధీసమేత !
అస్మదనుగ్రహంబునను వాని నన్నిటిని బఠింపుద్విజులెల్ల స్వర్గంబుఁ గాంచఁగలరు.

తే॥ మఱియు స్వామీఁదిభక్తి ధీమంతులగుచు వానికిని వ్యాఖ్యలిఖియించి వసుధపైఁ బ్ర
చారముంజేయువారలు సత్వరముగ ముక్తులగుదురు-నిజము మదుక్తులెల్ల" ౯౧౪

వ॥ అనివచించుటయు నట్టిగురుదక్షిణ సూర్యున కర్పించి నాగుడఁ జమత్కారపురం
బునకరిగి శాకల్య సమీపించి ౯౧౫

కం॥ "ధరణీసురవర! తొల్లిటిగురుఁడవు నాకీవు గానఁ గోరుకొనఁగదే
గురుదక్షిణ యర్పించెద నఱమర లేకుండ నెగ్గ్రమైనను భక్తిన్. ౯౧౬

ఆ॥ చదువుచెప్పినతఁడు జనకుండు జననియు నగ్రజుఁడు విశుద్ధులైననం బ
రిత్యజింపఁదగదు-స్తుత్యులు వారు. పూజించుచుండవలయు నెందివారి. ౯౧౭

కం॥ సాంగోపాంగంబుగఁ జదువంగలిగితి వేదములను. వానికి నర్థం
బుంగూడఁ జెప్ప నేర్చితిఁ. గురుదక్షిణయు నిమ్ము. తెలుపుము కోర్కెన్." ౯౧౮

వ॥ అని మనవిచేయుటయు శాకల్యుండిట్లనియె. ౯౧౯

ఆ॥ "ద్వాదశాత్మకథిత వేదరహస్యముల్ పాపనాశకములు పఠనఁజేయు.
నానఁ జెప్పుమయ్య వాని నన్నింటి నాకు. గురుదక్షిణగను గోరుకొంటి" ౯౨౦

వ॥ అనియిట్లు కోరుకొనుటయు యాజ్ఞవల్క్యుండు ౯౨౧

ఆ॥ "అయిన నరుగుదెంచు మస్మత్ప్రతిష్ఠితాదిత్యసవిధమునకు ద్విజవరేణ్య!
తన్మహాత్ములైన ద్వాదశాదిత్యుల యనుగ్రహమున వచింతు నేఁ గ్రమముగ" ౯౨౨

వ॥ అనిపలికి సబ్రాహ్మణశిష్యుండగు శాకల్య స్వప్రతిష్ఠితాదిత్యసాన్నిధ్యంబునకుఁ
దోడ్కొనిపోయి తదగ్రమం దతనికిఁ దనకు రవి చెప్పిన సకలవేదాంతవ్యా
ఖ్యానంబులను వక్కాణించె. అట్లు చెప్పఁబడిన వేదాంతంబు లవగతంబుచేసి
కొని చతుశ్చరణసంభవులైన బ్రాహ్మణులు యాజ్ఞవల్క్య సంతోషపెట్టుచు

ఆ॥ అనఘ! నీదు కరుణ నవగతవేదవేదాంతులైనవార మందఱమును.
కోరుకొనఁగదయ్య గురుదక్షిణను సమర్పింపఁగలము నీకుఁ బ్రియముతోడ"

వ॥ అని వాక్రుచ్చుటయు యాజ్ఞవల్క్యుం డిట్లనియె. ౯౨౫

ఆ॥ "అస్మదీయమైనయట్టి యీపండ్రెండుసవితృవిగ్రహముల సమ్ముఖమున
వేదములు పఠించు విప్రాళి మీ దయ స్వర్గమునకుఁ జేరఁ జనును గాక. ౯౨౬

క॥ బ్రహ్మవిచారణఁ జేసెడి బ్రాహ్మణులకు జననమరణపక్షతమౌ త

ద్బ్రహ్మపద మొదవుఁగా కో బ్రాహ్మణ్య! లొసంగుఁ డిదియె బలుదక్షిణగన్."

వ॥ అనియిట్లు కోరుటయు బ్రాహ్మణులు ౯౧౮

శా॥ "కలికాలంబున దౌస్థ్యభావసహితు ల్కాఁబోదురుర్వీసురుల్.
సలుపంజాలరు శ్రద్ధతోడ నెపుడున్ స్వాధ్యాయపాఠంబు వా.
గల వ్యాఖ్యానము లేమిచూడఁగలరిం? కష్టాట వాక్ప్రువ్వ మం
దలి సారంబును దౌస్థ్యయుక్తులయియుం దా రెట్లొ కీర్తింపఁగన్" ౯౧౯

వ॥ అనివచించుటయుఁ బెండియు యాజ్ఞవల్క్యుండిట్లనియె. ౯౨౦

ఆ॥ "అర్థలక్షణాఖ్యమగురథం యుంజంతి యనెడిప్రథమసూక్త మవ్విధమున
త్రిష్టుభాఖ్యమగుచు దీపించునటువంటి యాద్యమైనసూక్త మదెవిధమున ౯౨౧

క॥ చిత్రం దేవానామను మిత్రప్రీతికరమగుచు మిగిలెడిసూక్తం
బా త్రిష్ట్యంగప్రియము పవిత్రంబగు హంసయనెడి పృథుసూక్తంబున్ ౯౨౨

ఆ॥ పావమానుసనఁగఁ బ్రథితమౌ సూక్తంబు భక్తియుక్తులగుచుఁ బరమశ్రద్ధ
బహ్వృచుల్పఠింపఁ బరమపదమునకుం బోవఁగలరు భూమిదేవులార! ౯౨౩

ఆ॥ ఇనహితంబులైన యేకవింశతిసామములను శుచిత సామగులు పఠింప
మిత్రమండలంబు మెల్లన భేదించి యేగఁగలరు. చెప్ప నేమిగలదు? ౯౨౪

క॥ శతరికాసంపుటమును భాస్కరకల్పం బట్లు శాంతికల్పముగూడన్
పరికీర్తించినఁ గలిగెడిఁ బరమపదం బల యథర్వపాఠకతతికిన్. ౯౨౫

ఆ॥ అజ్ఞులేని వచ్చి యగ్నివాసరమున బిట్టుశ్రద్ధ జోతవెట్టిరేని
సప్తరాత్రికిల్బిషమునుండి విడువంగఁబడఁగలారుచూరె పాపులార!" ౯౨౬

### రత్నాదిత్యుని యుత్పత్తి

వ॥ అని యిట్టువచించుటయుఁ జతుశ్చరణబ్రాహ్మణు లందుల కంగీకరించిరి. యాజ్ఞవల్క్యుఁ డిట్లు ఖ్యాతింగాంచుటయు జనకుండు చనుదెంచి సర్వవేదాంతములను శ్రవణించె. రత్నాహ్వయుండగు రాజొకఁడు వచ్చి యాదిత్యమాహాత్మ్యం బవగతంబు చేసికొనినవాఁడై తనపేర నొక యాదిత్యుని సంస్థాపించె. అయ్యాదిత్యుఁ గూడ నాదిత్యవారంబున దర్శించిన సప్తరాత్రికృతపాతకంబు సంక్షయం బయ్యెడి. ఈయాదిత్యమాహాత్మ్యము విన్నవాని కశ్వమేధఫలంబు ప్రాప్తించు. సంక్రాంతినాఁ డయ్యాదిత్యవిగ్రహం బిచ్చియు మాహాత్మ్యమును వినియు నశ్వమేధ

### పురాణశ్రవణమాహాత్మ్యము

యాగఫలంబు పొందుదురు. ఈపురాణమంతయుం దొల్లి బ్రహ్మపుత్రుఁడైన భృగువునకు బాహులేయుండు ప్రవచించియున్నాఁడు. ఆభృగువువలన నంగిరసుండును నతనివలనఁ జ్యవనుండును నతనివలన ఋచీకుండును గ్రహించిరి. ఇట్లు పరంపరగాఁ ద్రిభువనంబుల వ్యాప్తంబైనయది. కుమారునిచేఁ బ్రథమోద్ధృతంబగు నీపురాణంబును సత్పురుషమధ్యంబున శ్రవణించిన సకలపాపవిమోచనంబును నాయుర్వృద్ధియు నయ్యెడిని. ఈహాటకేశ్వర క్షేత్రమాహాత్మ్యమును విన్న

వాని పున్నియమ్ము వర్షించుచున్న వారిధారలుంబోలె నాకాశమండలి నక్షత్ర
ములమాడ్కి గంగలోని యిసుక రేణువులవగిది లెక్కింప నలవుపడదు. భగవద్రూపం
బైన యీ హాటకేశ్వర క్షేత్రమహాత్మ్యగ్రంథమ్మును బ్రాహ్మణున కర్పించినఁ దద్గ్రంథ
స్థాక్షరసంఖ్యాకసంవత్సరంబులు స్వర్గస్థితి సంభవించెడు. దీనిపఠనంబుగాని శ్రవ
ణంబుగాని కొన్నిదినంబు లాచరించిన సర్వార్థసిద్ధియు సంఘటిల్లెడు. ౨౯

సీ॥ పుత్రార్థియైదీనిఁ బూర్తిగాఁజదువుచోఁ బుత్రవంతుండయి పొలుపుగాంచు.
ధనకాంక్షియైదీనిఁ దాఁ బఠియించుచో ధనవంతుఁడై మహాఘనతఁ జెలఁగు.
పతికాంక్షయై దీనిఁ బారంబు సేయుచో బహుమనోహరుఁడైన పతిని బడయు.
చుట్టంబులంజూడ గట్టిగాఁ జదువుచోఁ జూచు దూరస్థులౌ చుట్టములను.
వేదవేత్తయగును విప్రుండు చదివిన. పట్టభద్రుఁడగును క్షత్రియుండు.
వైశ్యుఁడు లభించు వరధనధాన్యముల్. సుఖపడుం గరంబు శూద్రజనుఁడు.

వ॥ ఇద్దాని శ్రవణించి వాచకుం బూజించిన బ్రహ్మవిష్ణురుద్రులు మున్నుగాను
బూజింపఁ బడుదురు. ఒక్కొక్కరంబె వినిపింపనిందు. వాని కేమియొసఁగినను
ఋణముదీర్చుకొనఁజాలరు.

సీ॥ అభిమతంబైనట్టి యావులనర్పించి చేతులు మోడ్చి పూజింపవలయు.
ఫలవంతమగునట్టి యిలను సమర్పించి ప్రీతిపూర్వముగ నర్చింపవలయు.
ఉత్తమంబైనట్టి హొన్ను నివేదించి దేవళ్ళఁబోలెఁ బ్రార్థింపవలయు.
వెలగల్గినటువంటి బలు వంపుకములిచ్చి వినయంబునను గౌరవింపవలయు.
బహువిధంబులైన పక్వాన్నములు పెట్టి బాగుగాను తృప్తిపఱుపవలయు.
నిపుణుఁడైనయట్టి యుపదేష్ట నిట్టులఁ గొలిచి శివపదంబు నొలయవలయు"

క॥ అనియిట్లు రోమహర్షణి ఘనశౌనకముఖ్య మౌనిగణమున కెలమిన్
వినిపించె నీపురాణం బనఘజనవిధేయ! శ్రీ పరాంకుశరాయా! ౩౦

మ॥ సురభాషన్ మును పల్కు బ్రాహ్మణులకున్ సూతుండు వారెచ్చ. నా
గరఖండం బది సర్వ మాంధ్రమునఁ జక్కన్ వ్రాసి నేనిష్టు నీ
కెలుఁగం జెప్పితి. నీవు నీదునుతు లెంతే శ్రద్ధ నీమిత్రులున్
చిరకాలంబు పఠించి కాంచుఁ డిఁక నుశ్రేయంబు భూమీధవా! ౩౧

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురు కరుణాకటాక్ష సంప్రాప్త కవితాసాహిత్యనిధాన
హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తిముక్తాయ
మాన సత్సభావిష్కృతావధానవిధాన జానపాటి పట్టాభిరామా
భిధాన సమాంధ్రీకృతంబగు స్కాందమహాపురాణాం
తర్గత నాగరఖండంబునందు సర్వము
దశమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# తప్పొప్పుల పట్టిక

———:o:———

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౧౩ | ౩ | శద్ధ | శ్రద్ధ |
| ౧౬ | ౧౭ | సంకాృతి | సంక్రాంతి |
| ౨౧ | ౨౨ | తగగు | తగదు |
| ౨౬ | ౨ | బూచిత | బూజిత |
| ౨౮ | ౨౩ | పిత | పితృ |
| ౩౨ | ౬ | మాప్రెడిక్ | మాన్రెడిక్ |
| | ౨౮ | కవ్యా | కన్యా |
| ౩౮ | ౭ | ప్రశేశించె | ప్రవేశించె |
| ౪౫ | ౨౧ | ఘాద్రి | ఘ్రాద |
| ౫౬ | ౨౯ | పేయ | సేయ |
| ౬౦ | ౨౨ | ఫెన | ఫేన |
| ౬౧ | ౧౫ | జన్మబు | జన్మంబు |
| ౬౪ | ౧౫ | నాలుగు | నాల్గు |
| ౬౫ | ౪ | ద్రచవణంబు | దచ్ఛ్రవణంబు |
| | ౧౪ | దనయా ! | దనయ ! |
| | ౧౫ | ప్రావస్త్యంబు | ప్రాశస్త్యంబు |
| ౬౬ | ౨౭ | సల్లక్షంబులు | సల్లక్షణంబులు |
| ౬౭ | ౧౧ | పదుండాత్మ | పదుంద్రాత్మ |
| | ౨౦ | తే॥ | ఆ॥ |
| ౭౬ | ౨౬ | సహస్త్ర | సహస్ర |
| | ౨౮ | శ్రీపుల | శ్రీఫల |
| ౯౩ | ౨౩ | జ్ఞాతి | జాతి |
| ౯౪ | ౨౨ | మెల్ల | మెల |
| ౯౯ | ౧ | మద్ | మత్ |
| ౧౦౪ | ౧౬ | యొడయుక్ | యొడలక్ |
| ౧౦౮ | ౪ | లేకహూ | లేకహో |
| | ౭ | నజ్ఞాల | నజ్ఞాన |
| | ౮ | నది | నని |
| ౧౦౯ | ౨౫ | పకలేప్సిత | సకలేప్సిత |
| ౧౧౬ | ౧ | ॥ | సీ॥ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|

౧౧౬ పుటలో “ అనుటయుగౌరి ” అను ౩౦ వ పద్యము తరువాత,

కం॥ అనవుడు షట్కృత్తిక ‘శ్రీ
స్తనంధయుని నీకొసంగి చాతుర్మాస్యక
వనజాప్తవారమున సుర
ధునిలోపలఁ దీర్థమాడఁ దోతెంచితిమేమ్’

అనుపద్యము చదువుకొనవలెను.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౨౨ | ౬ | కుబుధు | కుజబుధు |
| | ౨౯ | తాన | దాన |
| ౧౨౭ | ౪ | మత్స్యశ్రీ | మత్స్యశ్రీ |
| ౧౨౮ | ౩ | డాతితేయుం | డాదితేయుం |
| ౧౩౪ | ౨౮ | పారింప | పారియింప |
| ౧౩౫ | ౩౦ | నర్మహాము | నర్మ్హాము |
| ౧౩౬ | ౯ | గరంబుండ | గరంబుండు |
| ౧౫౧ | ౫ | దఱుకు | దఱచు |
| | ౨౫ | కామహర్షణి | రామహర్షణి |
| ౧౫౨ | ౩౦ | కరగు | కరుగు |
| ౧౫౫ | ౭ | పూర్ద్వేశ | పూర్ద్వేశ |
| ౧౫౬ | ౨౧ | పూష | పూష |
| ౧౬౦ | ౧౭ | మహాద్రిదులు | మహాద్రిగులు |
| | ౨౧ | నిష్పాడ | కిష్పాడ |
| ౧౬౩ | ౨ | ఁగనుట | నగుట |
| ౧౬౪ | ౧౯ | తదుత్సత | తదుత్సవ |
| | ౨౧ | పూష | పూష |
| ౧౭౩ | ౮ | యాడుడు | యూడుడు |
| ౧౭౪ | ౯ | యున్న | యన్న |
| ౧౭౯ | ౧౫ | హోమ | హేమ |
| | ౨౮ | హోమాది | హేమాది |
| ౧౮౮ | ౨౮ | మనను సరించి | మనుసరించి |